ఆంగ్లానువాదము.

శ్రీ. పి. దానియేలు కవి.

*Imprimatur,*

✠ W. BOUTER.

Episcopus Nellorensis.

*19—3—1959.*



# జీవజలనిధి.

## జేసునాధుని తిరుహృదయ భక్తిని గూర్చి 12 వ భక్తినాధుల నిరూపము

(హౌరిఏతిస్ ఆక్వాస్. నీళ్లు చేదుకొందురు.)

### పీఠిక.

తిరుహృదయ భక్తి:

"మీరు రక్షకుని జీవజల నిధులనుండి ఆనందముతో నీళ్లు చేదుకొందురు" (ఇజయా 12 అ. 3 వ.)

మా ప్రవక్త ఇజయా దీర్ఘదర్శి రాబోవు కాలమున, యుగములో ప్రపంచమునకు ప్రసాదించనై యున్న పలువిధము లైన, అత్యంత ఫలవంతములునగు ఈవులనుగూర్చి, భావగర్భిత మైన ఊహాశక్తితో ముందుగా తన వాక్యముద్వారా చాటించి యుండెను. యావత్ కతోలిక లోకమునుండి తనకు చేరిన విన్నప ముల నాలకించి, చిరస్మరణీయులును, మాకు పూర్వము జగత్ పీఠాధిపతులునగు 9 వ భక్తినాథ పాపుగారు, 100 సంవత్సరము లకు పూర్వము కతోలిక ప్రపంచమందంతట జేసునాధుని తిరు హృదయ పండుగను నెలకొల్పి, ఆచరించవలెనని శాసించిన సం వత్సరమును విశేషము జ్ఞాపకము జేసుకొన మనకీవాక్యము సూచించు చున్నది.

ఎందుకనగా అట్టి పరలోక కృపావరములు జేసు తిరుహృదయ భక్తి ఫలితముగా క్రీస్తు ముద్రగల ఆత్మలలో కుమ్మరింపబడి, వానిని పవిత్రపరచుచు, మోక్షాదరణతో, పుణ్య సంపాదనకు ప్రేరేపించు చున్నది. కాబట్టి "శ్రేష్ఠమైన ప్రతి దానమును, ఉత్తమమైన ఒక్కొక్క వరమును పైనుండియే జ్యోతిర్మయుడైన తండ్రియొద్దనుండి దిగునవి" (అర్చ్య. జాకోబు 1:17) యను అపోస్తలుడైన జాకోబు

గారు వచించిరి. ప్రపంచమంతటను నేడు వ్యాప్తినొందుచున్న జేసు తిరుహృదయ భక్తి ఉద్యమమును మనకాలమందు పలువిధములయిన శ్రమల మధ్య అగ్నిపరీక్షకును, పోరాటమునకు సహించవలసియున్న తిరుసభ యను తన అద్భుత శరీరమునకు, మనుష్యావతారుడైన మన దివ్య రక్షకుడును, పరలోక పితకును, మానవ సంతతికిని, సత్యము, వరప్రసాదముల విషయములో మధ్యవర్తియునగు జేసు నాధుడు అనుగ్రహించిన అమూల్యమైన ఈ దానమును సకారణముగా మేము అంగీకరించుచున్నాము.

వాస్తవముగా యీ యమూల్యమైన యీవిని యనుభవించుచున్న తిరుసభ తన దివ్య సంస్థాపకునియెడల అత్యంత స్నేహమును చూపుటకును, సువిశేషకుడైన అర్చ్య. జ్వాన్నెనుగారితో జేసుక్రీస్తునాధుడు తామే స్వయముగ జెప్పిన ఈ క్రింది ప్రేరణ వాక్యమును పూర్తిగా కొనసాగించుచు, నెరవేర్చుటకును, శక్తిసంపన్నము గావించబడియున్నది. "ఆ పండుగలో మహా దినమయ్యేడు అంత్యదినమున, జేసువు నిలిచి ఎలుగెత్తి: ఎవడైనను దాహము గొనెడు పక్షమున నాయొద్దకువచ్చి త్రాగునుగాక, నన్ను విశ్వసించెడువాడెవడో వేదము పలుకునట్లు, అట్టివాని గర్భమునుండి జీవ జల నదులు పారునని చెప్పెను. (జ్వా. 37:7)

తన దివ్య హృదయమునుండి "జీవజలము" స్రవించునని ఆయన వాగ్దానము చేయునప్పుడు జేసుస్వామిని వినుచుండిన వారలామాటలను, పూర్వవేదములో మోషేచే కొట్టబడినప్పుడు ఆ బండనుండి (బండ క్రీస్తునకు సాదృశ్యము) జలము అద్భుతముగా నుబికి పారుటనుగూర్చియు, మెస్సియా రాజ్యమునుగూర్చియు, ఇజయాను, ఎజికియేలు, జకరియా మొదలగు దీర్ఘదర్శులు ప్రవచించిన వాక్యములతో సంబంధపరచుకొనుట కష్టతరముగాదు. (ఇజయా 12:3; ఎజికియేలు 42:1; జకరియా 13:1; నిర్గమ 17:1–7; సంఖ్యా 22:7; 1 కొరింతి 10:4; దర్శ. 7:17, 22:4).

త్రియేకత్వమున తండ్రి, కుమారుల ప్రేమమూర్తియైన స్పిరితుసాంక్తు సర్వేశ్వరుడే దివ్య స్నేహమునకు జన్మభూమియై యున్నాడు. "మనకొసగబడిన స్పిరితుసాంక్తువలన దేవప్రేమ మన

హృదయములలో కుమ్మరింపబడియున్నది'' (రోమా 5:5) అను వాక్యములో జేసునాథుని పలుకులను ప్రతిధ్వనింప జేయుచున్నాడో యను రీతిని, విశ్వసించెడి వారల హృదయములందు కుమ్మరింపబడు దేవస్నేహము స్పిరితుసాంక్తు సర్వేశ్వరునివలననే కలుగుచున్నదని అన్యజనాపోస్తులుడైన అర్చ్యు. చిన్నప్పగారు దృఢముగా జెప్పుచున్నారు.

పూజ్యులైన సహోదరులారా! వేదగ్రంథములో తెలియ జేయబడినట్లు క్రీస్తువుల ఆత్మలలో రగిలి యుండవలసిన ఈ దివ్య దేవప్రేమకును, తానే ప్రేమమూర్తియైన స్పిరితుసాంక్తు సర్వేశ్వరునకు మధ్యనుండు సన్నిహిత సంబంధములె, జేసునాథుని తిరు హృదయముపట్ల మన కుండవలసిన భక్తిస్వభావమును తేటగా సూచించుచున్నది. ఏలయనగా ఈ భక్తియొక్క ప్రత్యేక స్వభావమును మనము లోతుగా ఆలోచించిన, తిరుహృదయభక్తి, మత సంబంధమైన ఉత్తమ అభ్యాసమైయున్నది. ఏలననగా గాయపరచబడిన ఎవని హృదయము, ఆయనకు మనయెడలగల ప్రేమకు చిహ్నమో, ఆ దివ్యరక్షకుని ప్రేమకు, మన హృదయములను స్వాధీనము జేసి సంపూర్ణముగా సమర్పించుకొనవలయునని మనకు శాశించుచున్నది. అదేవిధముగా, కాదు, కాదు, దానికంటె యెక్కువగాగూడా దేవ ప్రేమకు మనము అచ్చియున్న ఋణమును మన సొంత ప్రేమతో చెల్లించవలయునని మనలను కోరుచున్నది. ఎందుచేతననగా దేవ స్నేహమను మూలముగానే దేవుని రాజ్యాధికారమును మానవ హృదయములు సంపూర్ణముగా అంగీకరించుచున్నవి. ''అయినను ఏలినవారితో చేరుకొనువాడు వారితో నేకమనస్సుయి యుండును'' (1 కొ, 6:17) అను వచనము ప్రకారము దైవచిత్తమును హత్తుకొని ఆయనతో ఐక్యమగు సహజగుణము మానవప్రేమకుగలదు.

## క్రీస్తువులలో వ్యతిరేకులు.

తిరుహృదయ భక్తిని తిరుసభ సర్వదా ప్రోత్సహించి గౌరవార్థముగా పాటించి, విశ్వాసులమధ్య వ్యాపింపజేయుచున్నది. మరియు తిరుహృదయ భక్తికి విరుద్ధమైన పకృతివాదము, ఉద్రేక

వాదములని పిలువబడు కృతిమ బోధనలనుండి కాపాడి శక్తివంచన లేక ప్రయాసపడుచున్నను, కతోలికేతరులైన క్రీస్తువునుండియు, నూతన విజ్ఞానములోను భక్తియందును, మునుపంజవేయు వాంఛతో రగుల్కొనబడితిమని చెప్పుకొను కొందరు కతోలిక క్రీస్తువులనుండియు, గడచినదినములలోను, నేటికాలమునందును ఈ అమూల్యమైన భక్తిసాధన చాలినంత సన్మానము పొందలేకపోవుట ఎంతో విచారకరమైన విషయమైయున్నది.

“నీవు సర్వేశ్వరునివరమును ఎరిగియుండిన పక్షమున” (అర్చ. జ్వాన్నెసు 4:10) గౌరవపాత్రులైన సహోదరులారా దివ్య రక్షకుడు తిరుసభకు ఒప్పగించిన విశ్వాసము, భక్తి యను పవిత్ర బొక్కసముల సంరక్షకులుగాను, గృహనిర్వాహకులుగాను ఎన్నుకొనబడిన మేము మా ధర్మములయెడల నిండు మెళకువగలిగి, జేసు తిరుహృదయ భక్తియెడల చెంచలభావములతో ప్రతికూలభావములను గలిగినవారలను మేము హెచ్చరించుచున్నాము. చెడుబాటను బట్టినమానవుల తప్పిదములపైనను, అశ్రద్ధ చూపెడువారిపైనను తిరుహృదయము విజయముపొంది తిరుసభయంతటను ఈ భక్తి కృత్యములు వ్యాపించుచుండగా కొందరు తిరుహృదయ భక్తి తగని కార్యమనియు, మానవుల, తిరుసభయొక్క అధ్యాత్మికాభివృద్ధికి హానికరమనియు తలంచ సాహసించువారిని హెచ్చరించ నాశించుచున్నారము.

ఎందుకనగా ఈ భక్తికృత్యముయొక్క ప్రాథమిక స్వభావమును అపార్థము చేసుకొనువారి సంఖ్యకు ఏ మాత్రము కొదువ లేదు. తిరుసభ అంగీకరించినట్టియు, ఆచరించ సూచించినట్టియు భక్తిసాధనలు చాలాగలవు. అందు ప్రత్యేకమైనవి కొన్ని, సామాన్యమైనవి మఱికొన్ని. గాని వానినన్నిటిని తప్పనిసరిగా నిర్వహించవలెనని తిరుసభ నిర్బంధముగా శాసించుటలేదు. అందుచేత తిరుహృదయ భక్తికృత్యముగూడ ఒకని కిష్టమైన, ఉపయోగించుకొన వచ్చుననెడి భావముతో పరిగణించుచున్నారు. ఇది చాలా భారమైనదనియు, కతోలిక సత్యముల రక్షణకు వ్యాప్తికి, సాంఘిక సిద్ధాంతముల ప్రచారమునకు, నేటి దినములలో అవసరమైన కతోలికోద్య

మముల అభ్యుదయమునకు, తమ శక్తిని సంపదను, వ్యయపరచుచు క్రీస్తురాజ్యమును వ్యాపింప జేయుటలో నిమగ్నులైనవారికి ఇది ప్రయోజనకరమైనదిగాదని వాదించ సాహసించు నంతటివారలు, మరికొందరుగలరు. కడన, వ్యక్తుల ప్రత్యేక జీవితములోను కుటుంబ సమిష్టి జీవితములోను — రెండింటియందు — క్రీస్తుపులకు తగిన అలవాటులను నూతనపరచుటలోను, వ్యాపింప జేయుటలోను తిరు హృదయ భక్తి అత్యంత శక్తిగలిగియున్నదని అభిమానించుటకు బదులు, దానిని ఉద్రేక భావముతోకూడినదనియు, భక్తి రూపక మనియు, ఆడువారికిమాత్రమే తగినదనియు, సంస్కృతీపరులైన మగవారికి చాలినంత వివేకవంతమైనదికాదనియు దలంచువారు కొందరుగలరు.

అదియునుగాక ఇట్టి భక్తికృత్యము, పశ్చాత్తాపము, ప్రాయ శ్చిత్తము, తదితర పుణ్యములను జేయవలెనని గోరుచున్నది. (ఈ పుణ్యములు అంతరంగిక పుణ్యములని చెప్పబడుచున్నవి. ఎందుకన గా బయటికి కన్పించు ఫలములనవి ప్రసాదించుట లేదు) గాన విశ్వాస విజయమునకు, క్రీస్తువ అలవాట్లను ప్రకాశవంతముగా రూపొందించుటకు వెదజల్లవలసిన అధ్యాత్మికమగు భక్తికి తిరు హృదయ భక్తి కృత్యములు తగినవికావని భావించువారు మరి కొందరున్నారు. గాని నాస్తిక భౌతికవాదము, లౌకికవాదము మొద లగు సిద్ధాంతముల నీడలలోనుండి (సత్యాసత్యముల మధ్యగల తారతమ్యమును దూరముగానుంచి) ప్రతి మతము సమానమైనదని యు మంచిదనియు, తప్పుడు సిద్ధాంతములుగలవారితో గలయుటచే పారంపర్యముగానున్న అలవాట్లు అంటువ్యాధిని సంపాదించుకొను నను విషయము ప్రతొక్కరికిని తెలియునిదికాదు.

పూజ్యనీయులగు సహోదరులారా! జేసునాథుని తిరు హృద య భక్తికార్యమును దృఢపరచుచు, మాకు పూర్వమున్న పరిశుద్ధ పాపుగారు, ఈసత్య ప్రకటన పీఠమునుండి, బహిరంగముగా చాటిన ఉద్దేశములకు వ్యతిరేకమైన పై అభిప్రాయములు పూర్తిగా నెట్లు పెడదారిన బట్టినవో ఎవరు గ్రహించలేకపోదురు? చిరస్మరణీయు లును మా పూర్వజగద్గురువర్యులునైన 13 వ సింహారాయులు పాపు

గారు దేనిని "మిక్కిలి ఉత్తమమైన భక్తిసాధన" యని ప్రకటించిరో ఎద్దానియందు నేడు ప్రతివ్యక్తిని, సమాజమును ఘోరముగా వేదించి బాధించుకీడులకు నిస్సందేహ నివారణ కలదని నిరీక్షించిరో, అట్టి ఈ తిరుహృదయ భక్తి, నిరుపయోగమైనదనియు, ఈ కాలమునకు తగినదికాదనియు చెప్పుటకు ఎవరు సాహసించగలరు? ఆచరించతగినదని మేము ప్రోత్సహించు ఈ భక్తికృత్యము అందరికిని ఆశీర్వాదకరమైనదని" వారు నుడివిరి.

ఇంతేగాక, కొన్ని హెచ్చరికలను ప్రేరణార్ధములైన కొన్ని సూచనలను వారు మన కొసంగియున్నారు. అవి జేసునాధుని తిరుహృదయమునకు సంబంధించినవై యున్నవి. "భూలోకముపై కాలూని ఎంతయో కాలమునుండి స్థిర నివాసమేర్పరచుకొనిన కీడులెన్నియో మెండుగాగలవు." ఎవని సహాయమువలన వానిని పారద్రోలనగునో, అట్టివాని సహాయము కోరుమని ఆ కీడులు మనలను పట్టుబట్టి పురికొల్పుచున్నవి. సర్వేశ్వరుని జనితైక కుమారుడైన జేసునాధుడుగాక అట్టి సహాయసంపన్ను డితరుడెవడై యుండును? "ఇక నే మనుష్యునిమూలమున రక్షణము కలుగదు. ఏలనగా మనము రక్షణము పొందుటకు ఆకాశము క్రింద మనుష్యుని కియ్యబడిన ఇతర నామమేలేదు. (అపో. 4:12) కాబట్టి ఎవరు మార్గమును జీవమును సత్యమునైయున్నారో వానినే మనము ఆశ్రయించవలెను. (1)

మాకు ముందున్నట్టియు, చిరస్మరణీయులైనట్టియు, 11 వ భక్తినాధ పాపుగారుగూడ ఈ భక్తిని ప్రోత్సహించి, క్రీస్తువ భక్తిని పెంపొందించు సాధనముగ గణించిరి. అందునుబట్టియే వారు ఈ క్రింది విధముగా తన లేఖలో వెల్లడించిరి. "క్రీస్తునుగూర్చిన సన్నిహిత జ్ఞానమునకు ఈ భక్తికృత్యము మానవులను నడిపించగలది. గనుకను గాఢతరముగా నాయనను ప్రేమించి, ఆయనను పోలి నడుచుకొనుటకు హృదయములను మిక్కిలి శక్తివంతముగా నడుపునదిగనుకను ఈ భక్తి రూపకములో మత సంబంధమైన విషయముల సంశ్లేషమును, ఉత్తమ జీవితమార్గమును పొందుపరచబడి యుండలేదా?" (2)

పూర్వమందున్న జగద్గురువులకంటె మాకు ఈ సత్య ము
ఖ్యాంశము, అధిక స్పష్టమైనదియు, అధిక విలువగలిగినదియునై
యున్నది. మే మీ పవిత్ర పీఠము నంగీకరించినప్పుడే తిరుహృదయ
భక్తిసాధన క్రీస్తువులకు ఉత్సాహవంతమై, విజయవంతముగా పురో
గతి నొందుటయు, ఆ భక్తిఫలితముగా తిరుసభయందంతటను అసం
ఖ్యాకములగు సత్ఫలములు విరివిగా విస్తరించుటయు మేము గాం
చి సంతసించి మా ప్రథమ నిరూపములోనే వెల్లడించితిమి. (3)

**తిరుహృదయ భక్తివ్యాప్తి-జపాపోస్తలుల సంఘము.**

నిశ్చయముగా ఈ సత్ఫలములు మా పరిపాలన కాలములో
మెండుగా కాసినవి. అవి ఆపదలు ఆవేదనల రూపములో నిండి
యుండినను చెప్పశక్యముగాని ఆదరణతో నలరారియున్నవి. ఎందు
కనగా మనకాలమునకు సరిపడునట్టియు, ఈ భక్తిసాధనను విరివిగా
వెదజల్లుటకు దోహదకరమైనట్టియు, ఉద్యమములు ఎన్నియో ప్రా
రంభింపబడినవి. సంస్కృతిని, మతమును ఉదారతను పెంపొందించి
ముందుకు నడిపించగల సంఘములు మరియు చారిత్రక, వైరాఖ్యక,
పారమార్థిక విషయములను వివరించు గ్రంథ సేకరణము ఈ భక్తి
వ్యాపకమునకు తోడ్పడినవి.

విశేషించి "జపాపోస్తలుల" సంఘ అధ్వర్యమున కొనసాగిం
పబడుచున్న ఉత్తమ భక్తికృత్యములు. అభ్యాసములు ఉదయించినవి.
జపాపోస్తలుల సంఘముయొక్క పరిపోషణవలనను, పలుకుబడివల
నను, కుటుంబములు, పాఠశాలలు, సంస్థలేగాక, కొన్నియెడల
రాష్ట్రములు, దేశములు తిరుహృదయమునకు ప్రతిష్ఠింపబడినవి.
పితృ ప్రేమపూర్వకముగా, వీనిని ఉత్సాహపరచుటయేగాక, మా
లేఖలు, ఉపన్యాసములవలనను, అటుగానిచో కనీసము రేడియో
ప్రకటనల మూలమునను ఉగ్గడించి యున్నాము.

కాబట్టి మన దివ్యరక్షకుని తిరుహృదయము నుండి ఉబికి
ప్రవాహమై పారునట్టియు, స్పిరితుసాంక్తు సర్వేశ్వరుని శక్తి ప్రభావ
ములచేత, తిరుసభ బిడ్డల అసంఖ్యాకములగు నాత్మలయందు
సర్వత్రా ప్రాకి, అలముకొనుచున్నట్టి రక్షణ జలముల (ఉత్తమమైన

దైవ ప్రేమావరములు) అవిరళతను మేము గాంచుచున్నాము. ఇట్టి సమయమున గౌరవనీయులగు సహోదరులారా! "మనలో పని చేయు తన శక్తిచొప్పున మన మడుగువానికంటె గ్రహించుకొను వానికంటె మరియెక్కువగా సహాయముచేయ శక్తిగలవానికి (సర్వేశ్వరునికి), జేసుక్రీస్తునిమూలముగా తిరుసభలో తరతరములు సదా కాలము మహిమ కలుగునుగాక" (ఎఫేసి 3 అ. 20-21 వ) అనెడు అన్యజనాపొస్తలుని స్తుతిగీతము ప్రతిధ్వనించునట్లు సకలమేలులను దయచేయు దేవునికి కృతజ్ఞతాస్తోత్రములను చెల్లించుటలో మాతో నేకీభవించుడని పితృ హృదయముతో మేము మిమ్ములను ప్రోత్సాహపరచక యుండజాలము. అయినను యుగయుగములకు రాజైన సర్వేశ్వరునకు మీరు కృతజ్ఞతాస్తోత్రములు చెల్లించిన తదుపరి, జేసునాథుని తిరుహృదయ భక్తినిగూర్చి హృదయములలో నాటుకొనునట్లు ధ్యానించవలయునని మిమ్ములెగాక తిరుసభలోనున్న మా బిడ్డలనందరినిగూడా ఈ మా నిరూపముద్వారా ఉత్సాహజనకముగా మేము ఆకాంక్షించుచున్నారము. ఈ భక్తి పరిశుద్ధగ్రంథ సిద్ధాంతములపైనను, తిరుసభయొక్క మహర్షుల వేద ప్రవీణుల దృఢమైన బోధనలపైనను ఆధారపడియున్నవని మీరెఱుంగ వలయును. ఎందుకనగా తెలియజేయబడిన సత్యముతో వెలిగింపబడి, ఈ భక్తిసాధన సారాంశస్వభావపు లోతులోనికి చొచ్చుకొనిపోయి చూచినప్పుడుమాత్రమే మోక్ష వరప్రసాదముల తరుగని బహుమానముల రాశిని కనుగొనగలము. ఈ భక్తివలన చేకూరినట్టియు, చేకూరగలవని నిరీక్షింపబడునట్టియు లెక్కలేని మేలులను ధ్యానించుటచేత, తిరుసభయంతటా కొనియాడ నిర్ణయించబడిన తిరుహృదయ పండుగ ప్రథమ శతవార్షికోత్సవము ప్రసంశాపాత్రముగా కొనియాడబడగలము.



ఉద్దేశము.

జేసునాథుని తిరుహృదయ భక్తి నిజస్వరూపమును గూర్చిన లోతైన జ్ఞానమును క్రీస్తువులు సంపాదించుకొనునట్లును, మరియు దాని సత్ఫలములను మెండుగా పొంది ఆనందించవలయునని మా యుద్దేశమైయున్నది. ఈ యుద్దేశముతో, నిజముగా ఏ ప్రేమయొక్క లోతును ఎన్నటికైనా చాలినంతగా మనము గ్రహింపజాలమో, మానవ సంతతిపై సర్వేశ్వరునికి గల, ఆయనంత యపార ప్రేమను గూర్చి ప్రాత, క్రొత్త నిబంధనలయందు ఏ యే పుటలలో తెలియ జేయబడియున్నదో ఆ వాక్యములను మేము మొదట వ్యాఖ్యానించ దలంచియున్నారము. అటు తరువాత తిరుసభ మహర్షులు వేదాంత పండితులు, మనకు పారంపర్యముగా నొప్పగించిన వ్యాఖ్యానము నందలి ముఖ్యాంశములను మీకు జ్ఞాపకపరచ తలంచియున్నారము. కడన, దివ్యరక్షకుని తిరుహృదయ భక్తికిని, ఆయనకు చేయవలసిన ఆరాధన మహా పరిశుద్ధ త్రిత్వమునకు మానవులపైగల ప్రేమకును, గల మిక్కిలి దగ్గరి సంబంధముయొక్క నిజరూపమును వెలుగులో నికి దెచ్చుటయు మాచే బూనిన కార్యమైయున్నది.

ఎందుకనగా ఈ యుత్తమ భక్తియొక్క ప్రధానాంశములను వేదగ్రంథముయొక్కయు, తిరుసభ పారంపర్యముగా పొందిన సిద్ధాంతములయొక్క వెలుగుజాడలలో మేమిప్పుడు వివరించగలిగిన క్రీస్తువులు మరి సంసిద్ధముగా "రక్షకుని జీవజల బుగ్గలనుండి ఆనంద ముతో నీళ్లు చేదుకొందురు". (ఇజయా 12 అ. 3 వ.) అప్పుడు సత్యసభయొక్క పవిత్ర సాంగ్య కాండలోను, అంతరంగిక, బహి రంగిక జీవితములోను, కార్యాచరణలోను, జేసునాథుని తిరుహృద య భక్తి సాధన ఆక్రమించుచున్న అతి ప్రాముఖ్యస్థానమును, వెనుకటికంటె స్పష్టముగా తెలుసుకొన గలుగుదురు.

తిరుహృదయభక్తి ఫలితముగా జీవితమును సరిదిద్దుకొన గలుగుటలో అధ్యాత్మికా ఫలములను, సంఘ కాపరులు కోరునం తటి పరిమాణమును వారలు పొందగలిగినప్పుడు మేము విశ్వాసు లను అభినందించగలము.

## ద్వితీయ భాగము.

### దివ్యగ్రంథములోను, తిరుసభ ప్రారంభమునుండి వ్రాయబడిన మత పుస్తకములలోను తిరుహృదయ భక్తినిగూర్చి గుర్తించబడిన విషయములు.

ఉపోద్ఘాతము: ఈ భక్తిసాధన సంబంద అంశములు, ప్రాత క్రొత్త నిబంధనలయందు వ్రాయబడియున్నవి. అయినను సూచించబడిన వేదవచనముల ఔచిత్యమును ప్రతి ఒక్కరు సరిగా గ్రహించుటకు, దివ్యరక్షకుని తిరుహృదయమునకు తిరుసభ ఏల ఉత్తమారాధన సమర్పించుచున్నదో ఆ కారణమును సరిగా తెలిసికొనవలసియున్నది. గౌరవ పాత్రులగు సహోదరులారా! ఆ కారణము రెండు విధము లుగా నున్నదని మీరెరుంగని సంగతికాదు. అందు మొదటి కార ణము ఒక ముఖ్య సిద్ధాంతముపై నాధారపడియున్నది. అది ఏదనగా: జేసునాధుని దేహములోని అవయవములన్నియు (అంగములు) పవిత్రములే. అందును విశేషించి మానవకాయములో హృదయము ఉత్తమోత్తమమైనది. అట్టి జేసునాధుని తిరుహృదయము, దివ్య వార్తయైన వ్యక్తితో సంయోగము చెందియున్నది. అందుచేత సర్వేశ్వరుని జనితైక కుమారుని, తిరుసభ ఏ యుత్తమారాధనతో గౌరవించుచున్నదో అట్టి ఆరాధనను జేసు తిరుహృదయమునకును అర్పించవలసియున్నది. ఇది క్రొత్తబోధ ఏమాత్రముకాదు. అది ఎఫేసునగరములో కూడిన, వేదశాస్త్రుల పరిషత్తు, కాన్స్టంటు పురములో సమావేశమైన ద్వితీయ సలహా సంఘము నిర్వచించిన కతోలిక వేద సత్యములను పొరబడనివ్వక జాగ్రతగా కాపాడుకొన వలసిన సమస్యయైయున్నది. (5) రెండవకారణము: ఇదియొక ప్రత్యేక సూత్రముపై నాధారపడియున్నది. దివ్యరక్షకుని హృదయ మునకు ప్రత్యేక విధముగా ఉత్తమారాధన చెల్లింపవలయునని ఈ వాదము శాసించుచున్నది. దానికి చాలినంత హేతువు లేకపోలేదు అదేమనగా: ఆయనయొక్క సర్వేంద్రియములకంటె నెక్కువగా ఆయన హృదయము మానవజాతిపై ఆయనకుగల ప్రగాఢ ప్రేమకు స్వభావిక చిహ్నమైయున్నదియను వాస్తవిక విషయమే ఆ వాదము నకు పునాది. అందువలననే "మన మొకరి నొకరము ప్రేమించుటకు

పురికొల్పునట్టి జేసునాథుని మితిలేని ప్రేమయొక్క చిహ్నమును, వాస్తవిక ప్రతిబింబమును యీ తిరుహృదయములో అణగి యున్నది. (6)

అవతరించిన వార్త యొక్క భౌతిక హృదయము, ఆయనకు మనయెడల గల అత్యంత ప్రేమకు చిహ్నమైనను, ఆ హృదయమునకు చెల్లించవలసిన భక్తికృత్యమునుగూర్చి పరిశుద్ధ గ్రంథములలో తేటతెల్లము చేయబడలేదని మనము సందేహించవలసినది లేనే లేదు. అయినను యీ విషయమును మనము బహిరంగముగా నొప్పుకొనినంత మాత్రాన అది మన కాశ్చర్యమును కలిగించరాదు. మనయెడల సర్వేశ్వరునికిగల ప్రేమను, మానవ ఆత్మలను శక్తివంతముగా ప్రేరేపించునటువంటి అర్థ ఛాయలుద్వారా, ప్రాత, క్రొత్త నిబంధనలలో రెంటియందును సమగ్రమముగా చాటబడలేదని మనకు పై సంగతి సందేహమును కలిగించకూడదు. ఎందుకనగా సర్వేశ్వరుని ప్రేమయే యీ భక్తి ప్రాథమిక కారణమైయున్నది. ఈ అర్థముతోగూడిన అంశములు నరావతార దైవమునుగూర్చి ముందుగనే ప్రవచింపబడియున్నవి. గాన అవి సర్వేశ్వరుని ఉత్తమ దివ్యప్రేమకు చిహ్నములని, శుభ శకునములని నిజముగా గౌరవింప బడగలవు. అనగా అవియన్నియు పవిత్ర తమమును, ఆరాధనకు తగిన దివ్యరక్షకుని హృదయమునకు సంబంధించినవై యున్నవి.

## పూర్వవేదము.

దేవునిచే ప్రేరేపింపబడి వ్రాయబడిన సత్యములుగల పూర్వవేద గ్రంథములోనుండి చాల సంబంధాంశములను పేర్కొనుట అవసరమని మా మట్టుకు మేము తలంచుటలేదు. సర్వేశ్వరునికిని తన ప్రజలకును మధ్య గావింపబడిన నిబంధనను, వారలర్పించిన ప్రాయశ్చిత్తబలులను మాత్రము యిచ్చుట మీ మనస్సుకు జ్ఞప్తికి తెచ్చుట చాలునని తలంచుచున్నాము. అతి ముఖ్య నిబంధనలు మోయిజు రెండు రాతిపలకలమీద చెక్కించెను. వానినే దీర్ఘదర్శులు వ్యాఖ్యానించియున్నారు! ఈ నిబంధన (ఒప్పందము) సర్వేశ్వరుని సర్వాధికార ముద్రగలిగి, మానవునియొక్క విధేయత చే నిరూపింపబడుటయే గాక, ప్రేమ యనెడు ఉన్నతాశముచే నిర్ధా

రణ చేయబడి బలము పొందింపబడియున్నది. ఎందుకనగా ఇశ్రాయేలీయులు సైతము దేవునికి విధేయించిన కారణము, దైవోగ్రతకు భయపడినందుచేత గాదు, సీనాయిపర్వత శిఖరమునుండి బయలుదేరిన ఉరుములు, మెఱుములు వారల ఆత్మలలో భీతిని కేకెత్తించినందునను గాదు. గాని సర్వేశ్వరునికి మానవులు చెల్లించవలసిన స్నేహబంధమే వారల నట్లు ప్రేరేపించెను. ఆ స్నేహబంధము ఈ క్రింది వాక్యములలో చక్కగా చిత్రింపబడి యున్నది. "ఇశ్రయేలూ! వినుము. మన దేవుడైన జోహోవా అద్వితీయుడగువాడు. కాబట్టి నీ నిండు హృదయముతోను, నీ నిండు మనస్సుతోను, నీ నిండు శక్తితోను నీ దేవుడైన జోహోవాను ప్రేమింపవలెను. నేడు నేను నీ కాజ్ఞాపించు యీ మాటలు నీ హృదయములో ఉండవలెను." (ద్వితియో 66, 4–6).

మోయిాజును, దీర్ఘదర్శులును, అర్చ్య. అక్వినాసు తోమస్ గారు, ఏరుకొనబడిన వారి "పెద్దలు" అని చాల బాగుగా నిర్వచించి యున్నారు. ధర్మశాస్త్రముయొక్క పునాదియంతయు సర్వేశ్వరుని "ప్రేమించుడు" అను ఆజ్ఞపై ఆధారపడి యున్నదని వారలు బోధించిరి. సర్వేశ్వరునికిని, మానవ సంతతికిని మధ్యగల సంబంధ బాంధవ్యములను వారు చక్కని ఉపమానములతో వర్ణించియున్నారు. తండ్రికి బిడ్డకు; భార్య భర్తకుగల పరస్పరానురాగముతో ఆ సంబంధమును వారు పోల్చియున్నారు. దేవుని సర్వాధికారమును, కఠినుడైన యజమానునికిగాని దార్జన్యపద్ధతితో మననుండి పొందు కఠోర బానిస సేవతోగాని వారు పోల్చియుండలేదు. ఇందాశ్చర్యమేమున్నది? ఐగుప్తు బానిసత్వమునుండి ఇశ్రయేలు ప్రజలు విముక్తిగాంచినప్పుడు మోయిాజు పాడిన ప్రసిద్ధ పరమగీతమును మన మిందు కుదాహరణముగా తీసుకొనవచ్చును. దేవుడు తానె తమను ఫారోదాసత్వమునుండి విడిపించియున్నాడని ఈ క్రింది ఉపమానములలో తేటగా తెలియపరచి యున్నాడు. అవి మన హృదయములను కదలింపకమానవు. "పక్షిరాజు తన గూడు రేపి తన పిల్లలపైని అల్లాడుచు, రెక్కలు బాపుకొని వాటిని పట్టుకొని తన రెక్కలమీాద వాటిని మోయునట్లు జోహోవా వారిని నడిపించెను.

(ద్వితియో 32, 11 వ.)

మానవుని సదా వెంటాడు దేవుని ప్రేమనుగూర్చి ఒస్పియా దీర్ఘదర్శికంటె ఎక్కువగానేదీర్ఘదర్శియు బహుశా వర్ణించియుండ లేదేమో? ఎందుకనగా: ఒస్పియా దీర్ఘదర్శి వ్రాసిన వాక్యముల లోని భావరసముల పుష్టి తదితర దీర్ఘదర్శుల పుస్తకములలో అంతగా గానరాదు. ఈ దీర్ఘదర్శి వ్రాసిన దైవ ప్రేరేపితమైన వాక్యములలో, ఎన్నుకొనబడిన జనాంగము యెడల సర్వేశ్వరునికిగల ప్రేమాసంబంధము, దయాప్రేమలుగల తండ్రిగను, గౌరవభంగ మొందిన భర్తయొక్కయు ప్రేమా సంబంధముతో అర్థముగాను, అభివంద్యనీయముగాను వర్ణించియున్నారు. విశ్వాస ఘాతకులపైనను, నమ్మకద్రోహుల యెడలను ఆయన ప్రేమ పలుచబడక, వారలదోషములకు తగినట్టుగా మాత్రము శిక్షించునట్టి దేవుని స్నేహాబంధమునుగూర్చి యీ దీర్ఘదర్శి వ్రాసిరి. అయినప్పటికిని దేవునిప్రేమ యిట్లుచేయుట, నమ్మకద్రోహియైన భార్యను, కృతజ్ఞత లేని పిల్లలను తిరస్కరించి వారల స్నేహసంబంధములను తెగతెంపు చేసుకొను ఉద్దేశముతో కాదు. గాని వారలా పాపములకు దుఃఖపడి ప్రాయశ్చిత్తము జేసి, పవిత్రపరుపబడి, నూతన మనస్సుతో బలమునొంది, ప్రేమబంధములతో బంధింపబడవలయుననియే ఇట్లు చేయుచున్నది. "ఇశ్రయేలు బాలుడైయుండగా నేను అతనియెడల ప్రేమగలిగి నా కుమారుని ఐగుప్తు దేశమునుండి పిలిచితిని. ఎఫ్రాయిమును చెయ్యిపట్టుకొని వానికి నడక నేర్పినవాడను నేనే, వారిని కౌగలించుకొనినవాడను నేనే, నేనే వారిని స్వస్థపరచినవాడనైనను ఆ సంగతి వారి మనస్సున నాటుకొనలేదు. ఒకడు మనుష్యులను తోడుకొనిపోవునట్లుగా స్నేహబంధనములతో నేను వారిని బంధించి ఆకర్షించితిని. ఒకడు పశువులమీాద కాడిని తీసినట్లు నేను వారి కాడిని తీసి వారియెదుట భోజనము పెట్టితిని.... వారి గాయములను నేను మాన్పివేయుదును. వారలను మునుపటివలె ప్రేమించుదును. వారి గాయములను నేను మాన్పివేయుదును. వారలను మునుపటివలె ప్రేమించుదును. ఎందుకనగా నా కోపోగ్రత వారలనుండి మరలినది. వారికి నేను ప్రాతఃకాలపు మంచునీటివలె నుందును.

లిల్లీ మొక్కలవలె ఇశ్రయేలీయులు అభివృద్ధి నొందుదురు. లెబనోను పర్వతము దానివేళ్లు తన్నునట్లు వారు తమ వేళ్లు తన్నుదురు." (ఓసియా 11, 1, 3, 14, 5-6.)

ఈ వైఖరిగానె ఇజయా దీర్ఘదర్శికూడా వ్రాసియున్నాడు. దేవుడు ఏరుకొనబడిన జనుల పరస్పరసంభాషణలను పురస్కరించుకొని ఆయన ఇట్లు వ్రాయుచున్నాడు. అయితే సియోను "జెహోవా నన్ను విడిచిపెట్టియున్నాడు. ప్రభువు నన్ను మరచియున్నాడు" అని అనుకొనుచున్నది. స్త్రీ తన గర్భమునపుట్టిన బిడ్డను కరుణింపకుండ తన చంటిపిల్లను మరచునా? వారైనను మరచుదురుగాని నేను నిన్ను మరువను. చూడుము యరిచేతులమీదనే నిన్ను చెక్కియున్నాను". (ఇజయా 49, 14, 15 వ.) భార్యాభర్తలకుగల ప్రేమ సంబంధమును భావనాశక్తితో సమీకరించుకొని, దేవునికిని, తాను ప్రేమించు ప్రజలకును మధ్యనుండు ప్రేమ సంబంధమును, హృదయములను కదిలించునట్లుగా, పరమగీత గ్రంథకర్త వర్ణించియున్నాడు. "బలురక్కసి చెట్లలో నల్లిపద్మము కనబడునట్లు స్త్రీలలో నా ప్రియురాలు కనబడుచున్నది. నేను పద్మములలో మేపుచున్న నా ప్రియుని దానను. అతడు నా వాడు. నీ హృదయముమీద నన్ను నామాత్రముగా నుంచుము. నీ భుజముమీద నన్ను నామాత్రముగా నుంచుము. ఎందుకంటె ప్రేమ మరణమంత బలవంతమైనది. ఈర్ష్య పాతాళమంత కఠోరమైనది. దాని జ్వాలలు అగ్నిజ్వాలా సమములు." (పరమగీతము 2:27, 7:2, 8:6)

మృదులమును, ఓర్పుతో కూడుకొనిన దేవునియొక్క ప్రేమ, గాఢమై అత్యున్నతమై కనిపించుచున్నది. ఎందుకనగా ఆయనకు వ్యతిరేకముగా అనేక పాపములను వారు కట్టుకొనుచుండినందువలన అప్పుడు సర్వేశ్వరుడు వారలను ఏవగించుకొని యుండినను, ఆయన వారలను పూర్తిగా నిరాకరించి విడిచి యుండలేదు. ఈ ప్రేమ మానవులకు దివ్యరక్షకుడు వాగ్దానము చేసిన జ్వాజ్వల్యమైన ప్రేమను ఆయన దివ్య హృదయమునుండి మానవులెల్లరికి భావికాలములో ఇయ్యనున్న అత్యంతప్రేమకు మాదిరి రూపముగను, నూతన నిబంధనకు పునాదిగను ఉండవలసియున్నది. దివ్యరక్షకుడు, సంఖ్యా

కములగు పాపములచేతను, నానా కీడులవలనను అణగగొట్టబడు చుండిన మానవులమధ్య నవతరించెను. తండ్రియైన దేవుని జనితైక కుమారుడును, అవతరించిన వార్తయైనవాడును, "దేవానుగ్రహమును, సత్యమును నిండినవాడై (జ్యా. 1:14) దివ్య వ్యక్తిత్వముతో ద్వైధాసమైక్యమైన (Hypostatic Union) తన మానవ స్వభావముతో" జీవజల బుగ్గయై ఎండి బీడై పోయిన ఈ భూతలమునకు చాలినంత నీరుపెట్టి, దానిని పుష్పఫలభరితమైన ఉద్యానవనముగా రూపొందించగలడు.

ఇట్టి యపూర్వమైన కార్యము, అమిత కృపా పరిపూర్ణమగను, యుగయుగములు ఉండునదియునైన సర్వేశ్వరుని నిత్యప్రేమ వలననే జరుగనైయున్నట్లుగా, ఈ క్రింది వాక్యములలో జరెమియా దీర్ఘదర్శి ముందుగనే ప్రవచించియున్నాడు. "శాశ్వతమైన ప్రేమతో నిన్ను ప్రేమించుచున్నాను గనుక విడువక నీ యెడల కృప చూపుచున్నాను; ఇశ్రయేలు వారితోను జూదావారితోను, నేను క్రొత్తనిబంధన చేయబోవుచున్నాను. అదిగో! ఆ దినములు రాబోవుచున్నవి. నేను వారికి దేవుడనై యుందును. వారు నాకు ప్రజలగుదురు. నేను వారి దోషములను క్షమించి, వారి పాపములను ఇక యెన్నడును జ్ఞాపకము జేసుకొనను." (జెరెమియా 31, 3, 33–34)

నూ త న వే ద ము .

మానవులకు దేవునికి మధ్య చేయబడిన క్రొత్త నిబంధనకును, ఇశ్రయేలీయులకును దేవునికిని మధ్య మోషియాజునిచే కూర్చబడి, జెరెమియా దీర్ఘదర్శిచే ముందుగానే ప్రవచింపబడిన నిబంధనకు గురుతును సంజ్ఞారూపకమైనదని సువిశేషము తేటగను, స్పష్టముగను తెలుపుచున్నది. ఈ క్రొత్త నిబంధన, నరావతారుడైన వార్త ద్వారాను, దైవ వరప్రసాదములతో సహకరించుటద్వారాను నెలకొల్పబడి కొనసాగింపబడినదే గాని తదితరమైనదిగాదు. కాబట్టి ఈ నూతననిబంధన సాటిలేని ఉదాత్తతకు, స్థాయికి గౌరవపాత్రముగా గణింపబడవలయును. ఏలననగా, పూర్వ నిబంధన గొఱ్ఱెల రక్తముతోను లేక దూడల రక్తముతోను ముద్రితమైయున్నది. గాని నూతన నిబంధన అట్లు కాదుగాని, విచక్షణా జ్ఞానము లేని సాధు జంతు

వులతో, భావికాల చిహ్నముగా గుర్తించబడిన "లోకముయొక్క పాపములను పరిహరించు సర్వేశ్వరుని గొఱ్ఱెపిల్ల" (జ్వా. 1, 29, హెబ్రె 9, 13–28, 10, 1–17) రక్తములో ముద్రితమైయున్నది. క్రీస్తు నిబంధన పాత నిబంధనకంటె శ్రేష్ఠమైనది. ఎందుకనగా ఇది బానిసత్వముపైనగాని, భీతిపైనగాని ఆధారపడి యుండలేదు. అంతే గాక తండ్రి కుమారుల మధ్య నుండవలసిన ప్రేమతో ముద్రింప బడినదై మెండైన వరప్రసాదముతోను, సత్యముతోను పోషింప బడుచున్నది. ఇందునుగూర్చి సువిశేషకుడైన జ్వాన్నెసు "ఆయన పరిపూర్ణతలోనుండి మనమందరము దేవానుగ్రహమునకు వెంబడి దేవానుగ్రహమును పొందియున్నాము. ఏలయనగా మోయిజుని వలన దేవాజ్ఞ యియ్యబడెను. వరప్రసాదమును సత్యమును జేసు క్రీస్తుని మూలముగా కలిగెను." (అర్చ్య. జ్వా. 1, 16—17) అని నుడివియున్నారు.

కాబట్టి "జేసువును ప్రేమించినవాడును, భోజనపంక్తిలో ఆయన రొమ్మున ఆనుకొనినవాడును" (అ. జ్వా. 21, 20) అగు శిష్యుడు చెప్పినప్రకారము, మనుష్యుడైన వార్తయొక్క పరమ రహస్యాన్ని ధ్యానములోనికి మనము కొనిపోబడ గల్గుచున్నాము. అందుచే వందనార్హులగు సోదరులారా! ఈ పరమరహస్యమును ధ్యానించుటలో మనము కాలము గడుపుచు సంచరించుట నిజము గానే యోగ్యముగాను, న్యాయముగాను సమంజసముగాను, మన ఆత్మ రక్షణకు దోహదముగాను ఉన్నది. ఈ పరమ రహస్యమును రూఢిచేయునట్టియు, సువిశేషములందు వెల్లివిసిరి పారునట్టియు, జ్యోతిచే వెలిగింపబడి, అన్య జపాపోస్తలుడు "క్రీస్తు మీ హృదయ ములలో విశ్వాసముద్వారా నివసించునట్లును, మీరు దేవప్రేమలో వేరుపారి స్థిరపడి సమస్త పరిశుద్ధులతో దాని వెడల్పు పొడుగు ఎత్తు లోతు ఎంతని గ్రహించుకొనుటకు సర్వేశ్వరుని సంపూర్ణత యందు సంపూర్ణులగునట్లు సమస్త జ్ఞానమునకు మించిన క్రీస్తుని ప్రేమను తెలిసికొనుటకును, శక్తిగలవారు కావలెను." (ఎఫేజి 3, 17—19) అని చిత్రించిన కోరికను మనముకూడా పొంది దానిని కార్యరూపములో నిర్వహించగలము.

ప్రాథమిక, సహజ స్థితిలో, దివ్య విమోచకత్వపు పరమ రహస్యము, దేవప్రేమయొక్క పరమరహస్యమే అయియున్నది. అనగా ఇది మానవజాతి పాపపరిహారమునకు చెల్లించ ఋణపడియున్న విస్తారమైన ప్రాయశ్చిత్తము, పరిహారములను ప్రేమించు విధేయతా మనస్సుతో, తమ తండ్రికి తాను సమర్పించు న్యాయమైన స్నేహ మునుగూర్చిన పరమరహస్యమే. "స్నేహము చేతను, విధేయత చేతను అనేక శ్రమల ననుభవించి మానవసంతతియొక్క పాపపరిహారము నకు చెల్లించనవసరమైన ప్రాయశ్చిత్తముకంటె అధికమైన ప్రాయ శ్చిత్తమును క్రీస్తుస్వామి తన పితకు సమర్పించుచున్నాడు" (8) మానవులు తమకు తామే తమ దోషములకు ప్రాయశ్చిత్తము చేయజాలరు. అందుకై మానవులందరియెడలను మహా పరిశుద్ధ త్రిత్వముయొక్కయు, దివ్యరక్షకునియొక్కయు దాక్షిణ్యాంకితమైన ప్రేమాప్రాయశ్చిత్తము మనకు కలిగియున్నది. (9) శృంగారవన ములో ఆదామునొక్క ఘోరపతనమువల్లను, ఎన్నుకొనబడిన జనాంగముయొక్క అసంఖ్యాక పాపములవల్లను, మానవులకు దైవ మునకుగల స్నేహము అంతరించెను. పోగొట్టుకొనిన స్నేహమును, తన పవిత్రరక్తమును చిందించుటద్వారా క్రీస్తుస్వామి గణింపరాని పుణ్యధనాగారమును సంపాదించి, మరల దేవునితో స్నేహమును కుదిర్చెను. కాబట్టి న్యాయరీత్యా పరిపూర్ణుడైన మన రక్షకుడు మన యెడల అత్యంత ప్రేమగలవాడై, మానవులు చెల్లించవలసిన ఋణ మును తానే చెల్లించివేసి మానవులను దైవహక్కుతో పొత్తు చేకూ ర్చెను. దానితోపాటు దేవుని న్యాయమునకు, దేవుని కారుణ్యమునకు అత్యద్భుతముగా సంధిని చేకూర్చెను. ఇదియె మన ఆత్మరక్షణా పరమరహస్యము. మిగత రహస్యములన్నింటికంటె యీ రహస్యము చాలా ఉదాత్తమైనది. ఉన్నతమైనది. దానినిగూర్చి తోమస్ అక్వి నాస్ ఏమి చెప్పిరో తెలిసికొనుడు. "తన శ్రమలమూలముగా మా నవుని విమోచించుటకు సర్వేశ్వరుని నీతిని, దాక్షిణ్యమును సంతృ ప్తిపరచి యున్నాడని మనము సదా నొక్కివక్కాణించవలసియున్న ది. దైవనీతిని ఎట్లు సంతృప్తిపరచెననగా: తన పాటులద్వారా మా నవసంతతి దోషములకు ప్రాయశ్చిత్తముచేసియున్నాడు. ఆయన

దాక్షిణ్యముగూడనట్టిదె. ఏలననగా: మానవుడు తనకుతానే మానవ సంతతియొక్క పాపములకు ప్రాయశ్చిత్తము జేయ నశక్తుడై యున్నప్పుడు, సర్వేశ్వరుడు తన సుతుని ప్రాయశ్చిత్తార్థ బలిగా నొసంగెను. ప్రాయశ్చిత్తము లేకుండ ఆయన మన పాపాక్రమమును రద్దుచేయుటకంటె యిది ఆయన హేరాళదయకు గొప్పగురుతైయున్నది. అందువలనె "దయాళత్వమున సంపన్నుడైన సర్వేశ్వరుడు మనలను కొరత లేకుండా ప్రేమించినందున, మనము పాపముచేత చచ్చినవారమైనప్పుడు మనలను క్రీస్తునితో బ్రతికించెను. ఆయన దయానుగ్రహముచే మీరును రక్షింపబడియున్నారు" (ఎపిఫి 2, 4-5).

తన పరలోకపు తండ్రియెడలను, పాపకళంకముచేత అపవిత్రులైన మానవులయెడలను, అవతారుడైన వార్తయొక్క స్నేహబాహుళ్యత "పొడవు వెడల్పులు, ఎత్తు లోతులు ఎంతోయని సకల పరిశుద్ధులతోకూడా మానవునికి సాధ్యమైనంతవరకు సరిగా గ్రహించ" (ఎఫే. 3:18) ఆయన ప్రేమ సర్వేశ్వరుని కుండవలసినంత పూర్తిగా అధ్యాత్మికమైనది మాత్రమేగాదని మనముగుర్తించవలసియున్నది. ఎందుకనగా "సర్వేశ్వరుడు నిరాకారుడు" (జ్వా. 4:24) వాస్తవికముగా యిటువంటి ప్రేమతోనే సర్వేశ్వరుడు మన పితామహులను, హెబ్రేయ జనాంగమును ప్రేమించియున్నాడు. సంగీత గ్రంథములోను, దీర్ఘదర్శనములలోను, పరమగీతములోను మనము చదివెడు మానవ పరిచయ పితృ ప్రేమాభావ ప్రకటనలు, సర్వేశ్వరుడు మానవసంతతిని ప్రేమించునట్టి సత్య సంపూర్ణాత్మీయమైన దైవప్రేమకు చిహ్నములును, ప్రమాణరూపములునై యున్నవి. ఇక సువిశేషములోను అపోస్తుల కార్యములు, నిరూపములలోని వాక్యములలో తెలియజేయబడిన దేవుని ప్రేమ, పూర్వవేదములో సూచించబడిన ప్రేమకు విభిన్నమైయున్నది. ఇది తిరుహృదయ ప్రేమను నిజముగా వర్ణించుచున్నది. అనగా సర్వేశ్వరుని ఆత్మీయమైన ప్రేమనేగాక, ఆయన మానవమైన ప్రేమనుగూడ ప్రాముఖ్యముగా జూపుచున్నది. దీనియందు ప్రతి కతోలిక క్రీస్తువునకు ఏమాత్రమైన సందేహము లేదు. క్రీస్తుమత ప్రథమ శతాబ్దిలో వేదమును అపార్థము జేసుకొనినవారు కొందరన్నట్లు, సర్వేశ్వరుని దివ్యవార్త లోక

మందవతరించినపుడు శూన్యమైన మాయాదేహమును ధరించ లేదు. అట్టి వారిని అపోస్తులుడైన జ్వాన్నేసుగారు "ఇట్లుండ వంచ కులనేకులు భూలోకమున నడయాడుచు జేసుక్రీస్తు మనుష్యావతార మెత్తెనని అంగీకరింపరు. ఇట్టివాడే వంచకుడును అంతిక్రీస్తుడునై యున్నాడు." (2 జ్వా. 1, 7) అను వాడి మాటల ఖండించెను. కాబట్టి క్రీస్తుస్వామి మానవ వ్యక్తిగా సంపూర్ణ సమగ్ర స్వభావ మును ధరించియున్నాడు. అద్దానినే పరిశుద్ధ కన్యమర్యాంబ స్పిరితు సాంక్తు సర్వేశ్వరుని అనంతశక్తిచే తన గర్భమునదాల్చెను. (లూకా 1:35) దైవవ్యక్తి మానవస్వభావమును ధరించెను. అందువలన మానవస్వభావములో ఇక ఏకొరత, ఏ కొదువ లేశమైనను లేనే లేదు. కొదవలేని అట్టి ద్వంద్వ స్వభావమును ఆయన దాల్చియు న్నాడు. ఇందునుబట్టి ఆత్మీయదృష్ట్యాను శరీరకదృష్ట్యాను యే లోటులేదు. అనగా జ్ఞానము, చిత్తములతోను, ఇతరమైన అంత రంగిక బహిరంగిక సర్వజ్ఞాన శక్తులతోను, పంచేంద్రియములతోను, సకల వాంఛలతోను, స్వాభావిక ప్రేరణలతోను అది సాంగోపాం గముగా నిండి నిబిడీకృతమైయున్నది. ఈ సత్యమును తిరుసభ బోధించుచున్నది. ఎందుకనగా రోమీయు పవిత్ర పీఠాధిపతులు, వేదాంతశాస్త్ర పరిష్యత్ సలహాదారుల సంఘము, దానిని బహి రంగముగా సంగీకరించి "ఆయన స్వభావములోను, మన స్వభావ ములోను సంపూర్ణమైన" దనియు (11) "ఆయన ఏకొరతలేని సమగ్ర స్వరూపి" యనియు (12) "సంపూర్ణ దైవమానవుడును, సంపూర్ణ నరదైవమునై యున్నాడు" అనియు (13) నిర్వచించి యున్నాడు.

కాబట్టి జేసునాథుడు నిజమైన శరీరమును కలిగియున్నాడనుట లో మనము సందేహము పడజాలము. ఆ శరీరమునకు మానసమైన గుణములన్నియు నిండారుగా నున్నవి. వాని నన్నిటినిమించినది ఆయన ప్రేమ. అదే విధముగా మనకువలె ఆయన ఒక భౌతిక హృ దయమును కలిగియున్నాడనుటలోగూడ మనము సందేహపడ జాలము. ఎందుకనగా సర్వాంగములలో ఉత్తమమైన యీ అంగము లేకుండా మానవుడు జీవించలేడు. మరియు ప్రేమానురాగములు

గలిగియుండజాలదు. అందుచేత అవతారుడైన వార్తయొక్క దివ్య వ్యక్తిత్వో ఐక్యమొందిన జేసునాథుని తిరుహృదయము నిస్సందేహముగా మధురభావములలో ముఖ్యమగు ప్రేమ మున్నగు ప్రేరణలతో పూరితమై యున్నది. ఇట్లు రెండు విధముల అనగా దివ్య స్నేహముతో నిండిన మానవ సంకల్పములతోను పితతోను స్పిరితుసాంక్తుతోను సుతునికిగల అనంత ప్రేమతోను, ఆ ప్రేమానుభూతులు ఎంతో సంపూర్ణముగా అన్యోన్యసమైక్యతతో లీనమై యున్నప్పటికిని వారి ప్రేమలకు ఏ మాత్రము భేదభావములుగాని, వ్యత్యాసములుగాని కానరాదు.

ఇంతేగాక ఆయన దైవమానవ స్వభావముల వాస్తవికసమైక్యతను బట్టియు మానవ పాపవిమోచనాకార్యమునుబట్టియు, వార్తయైన దేవుడు వాస్తవమైన సంపూర్ణమానవ స్వభావమును ధరించి యుండెననియు తనకై రక్త మాంసాదులతో ఒక హృదయమును రూపొందించి నిర్మించుకొనెననియు, అది మన హృదయమువలె శారీరకమగు బాధల ననుభవించ గలిగెననియు, దానిని శరీరము నుండి విడదీయుటకు వీలు లేదనియు మేము నిరూఢపరచుచున్నాము. క్రీస్తు సమర్పించిన పాపప్రాయశ్చిత్తార్థమైన రక్తబలిదానము కొందరికి హేళనగను, పరిహాస పాత్రముగను గనిపించుచున్నది. అట్టి వారలనుగూర్చి మనము ఆశ్చర్యపడనక్కరలేదు. ఎందుకనగా, స్లీవ వేయబడిన క్రీస్తునాథుడు జూదులకును, అన్యులకును పరిహాసపాత్రముగ నుండెనని అపోస్తులుడైన చిన్నప్పగారు (1 కొ. 1, వ-3) తెలియజేసిరి. ఎందుకనగా సర్వేశ్వరుని జనితైక కుమారుడు భౌతికమైన బాధలకును, మరణమునకును లోబడియున్న మనుష్య స్వభావమును ధరించెనని దివ్య గ్రంథము చాటుచున్నది. దీనితో నేకీభవించి కతోలిక విశ్వాసమునకు ప్రమాణములగు న్యాయబద్ధమగు అధికార గ్రంథములన్నియు ఆ విషయమునే రూఢీపరచుచున్నవి. మానవ పరిత్రాణ కార్యమును కొదువలేకుండ, సర్వసంపూర్ణముగ నిర్వహించుటకై ఆయన స్లీవమీద వ్రేలాడుచు రక్తబలిదానము జేయనెంచెను. అన్యజనాపోస్తులుడు ఈ విషయమును ఈ క్రింది వాక్యములలో నెంత సంక్షిప్తముగా వ్రాసియున్నాడో వినుడు:—

"ఏలనగా, పరిశుద్ధపరచువారును, పరిశుద్ధపరుపబడువారును అందరును ఒకరిమూలమున గలుగుచున్నారు. ఈ హేతువుచేత వారలను సహోదరులని పిలుచుటకు అతడు సిగ్గుపడక "మీ నామమును నా సహోదరులకు ప్రకటించుదును, సభ మధ్యమున నిన్ను స్తుతించుదును." అనెను. మరియు "నేను ఆయనను నమ్ముకొని యుందును" అనియు "ఇదిగో నేనును సర్వేశ్వరుడు నా కిచ్చిన నా పుత్రులును" అనెను. అందువలన బిడ్డలు మాంసమందును రక్తమందును సంబంధులై యున్నందున ఆ ప్రకారమే మరణమునకు అధిపతిని అనగా పిశాచిని తన మరణముచేత నాశనము చేయుటకును.... అందుచేత ప్రజల పాపములను పరిహరించుటకై సర్వేశ్వరుని యెదుట కనికరమును నమ్మకమునుగల పెద్ద గురువు అగు నిమిత్తము అన్ని విషయములలో అతడు తన సహోదరులవంటివాడు కావలసివచ్చెను. తాను శోధింపబడి పాటు లనుభవించెను గనుక శోధింపబడు వారలకు సహాయముచేయు శక్తికలిగి యున్నాడు". (హెబ్రీ 2 అ. 11-14; 17-18).

## తిరుసభ ప్రారంభ వేద ప్రవీణులు.

దైవీకముగా తెలియజేయబడిన మత సత్యములకు వాస్తవిక సాక్షులైన తిరుసభప్రారంభ వేద ప్రవీణులుగూడా. అపోస్తలులైన చిన్నప్పగారు ముందుగా నేమినుడివెనో దానినే ధ్రువపరచియున్నారు. అనగా మనుష్యావతారముయొక్కయు విమోచనా కార్యముయొక్కయు రహస్యము దేవప్రేమలో నణిగియున్నది ఆయన తన యనంత ప్రేమను మనకు తెలియపెంచి మన నిత్యరక్షణకొరకు సంపూర్ణమానవ స్వభావమునేగాక నాశనకరమగు బలహీన దేహమునుగూడను జేసునాధుడు ధరించెనని వారలు వ్రాసిన వ్రాతలలో మనము తరచుగా చదువుచున్నాము.

అన్యజనాపోస్తులుని వాక్యములను ప్రతి ధ్వనింపజేయుచున్నాడో యనునట్లు, అర్చ్య. జుస్తీనుగారు "ఎందుకనగా జన్మించనటువంటియు, మహోన్నతుడైన సర్వేశ్వరునినుండి, జన్మించిన వార్తను మన మారాధించి ప్రేమించుచున్నాము" మన పాపాశ

లలో పాలివాడై యుండెను గనుకనే, వానికి ఔషధము సంసిద్ధము చేయగలుగుటకుగాను ఆయన మన నిమిత్తమై తనకు తానే తనను మానవునిగా జేసుకొనెను. (15) ఇంద్రియ గోచరములగు జేసునాథుని అనురాగములు పవిత్రమైనవేగాక వాస్తవములునై యుండెనని నిరూపించుచు, అర్చ్యి. బేసిల్ అనువారు చెప్పినదేమనగా "నిజమైన నరుడై సాక్షాత్కరించి వాస్తవిక స్వాభావికానురాగములను స్వీకరించి, ఆయన మాయ మనిషిగాదని మనకు తేటతెల్లము జేసెను. గాని పవిత్ర జీవితమును కలుషితము జేయు, మాలిన్యమగు అనురాగములను ఆయన గైకొన నిరాకరించెను. ఎందుకనగా అవి అకళంకమగు తన దైవత్వమునకు అయోగ్యమైనవి యని ఆయన ఎంచెను. (16) అదే ధోరణిలో అంతియోకియా తిరుసభకు జ్యోతియైన అర్చ్యి. జాన్ క్రిసోస్తముగారుగూడా, దివ్యరక్షకుడు ఇంద్రియగోచరములగు ఏ యనురాగములకు తన్ను లోబరచుకొనెనో, అవి తాను సంపూర్ణ మానవ స్వభావమును దాల్చెనని స్పష్టపరచినవని నుడివిరి. "ఎందుకనగా ఆయన మన స్వభావము పొందియుండనిచో తన జీవితములో నన్నిసార్లు పదే పదే విచారగ్రస్తుడుగా నుండియుండడు" నని ఉల్లేఖించిరి. (17) లతీను గురు రేణ్యులలో నేడు తిరుసభ ప్రస్తుతించు కొందరి వేదశాస్త్ర ప్రముఖులను నిచ్చట పేర్కొనుటకు మేమానందించుచున్నాము. మున్ముందు అర్చ్యి. ఆంబ్రోసుగారి అభిప్రాయమును చూచెదము. "సర్వేశ్వరుని దివ్యవార్త మనుష్యావతారమునందు గలిగియున్న ఇంద్రియ వ్యాపార, అనురాగములు, స్వభావమనెడు నిధినుండి ఉబికినచందమున, అవి ఆయన రెండు స్వభావముల సమైక్యతనుండి ఉత్పన్నమగు చున్నవి యని" ఆయన స్పష్టముగా జెప్పుచున్నాడు. "మరియు ఆయన ఆత్మను స్వీకరించినందున, ఆత్మకామితములనుగూడ ఆయన స్వీకరించియున్నాడు. ఎందుకనగా దేవుడు అయినంతమేరకు శారీరక వ్యసనములకు జిక్కి చావనేరడు" అని వారు సాక్ష్యమిచ్చుచున్నారు. (18) మరియు క్రీస్తు నిజముగా మానవ స్వభావము వహించియున్నాడని ఋజువు జేయుటకు అర్చ్యి. జెరోము యీ అనురాగముల నాధారము జేసుకొనెనో, తన ముఖ్యవాదమును కూర్చియు

న్నారు. "తాను నిజమైన మానవ స్వభావమును దాల్చెనని నిరూపించుటకే మన యేలినవారు వాస్తవముగా దుఃఖము ననుభవించిరి" అని ఆయన వచించియున్నారు. (19) అర్ఛ్య. అగుస్తీనువారు అవతారుడైన వార్తయొక్క అనురాగమునకును రక్షణకార్యము యొక్క ఉద్దేశమునకుగల పరస్పర సంబంధమునుగూర్చి మాట్లాడుచు "అశాశ్వతమైన మానవానురాగములనేగాక బలహీనమైన మానవదేహమును, మానవ శరీరమునందు ముద్రించబడియున్న మరణమునకుగూడా ఆయనలోనాయెను. ఇట్లు చేయవలసిన అగత్యత ఆయనకు లేనేలేదు. గాని తన దాక్షిణ్యాంకితమైన ప్రేమ ప్రేరణచేతనే ఆయన ఇట్లు చేసియున్నాడు. మరియు అందుమూలముగా తన జ్ఞానశరీరమైన తిరుసభను తనవలె రూపొందించి దానికి తాను తలయైయుండ చిత్తగించెను. పరిశుద్ధులను తన్ను విశ్వసించెడివారలను, తన జ్ఞానశరీరములోని అవయవయములు శోధించబడినపుడు, దేవవరప్రసాదములకు తాను అయోగ్యుడు కాదని తలంచగల్గుటకును, మరియు ఆ పాపములు మానవబలహీనత్వమునకు గుర్తులని తెలిసికొని, సంగీతములో పల్లవి చందంబున, జ్ఞానశరీరము శిరస్సునుండి నేర్చుకొనగల్గును. (20) జాన్ దమాస్కీనుగారు తిరుసభ బోధనను ఈ క్రింది విధముగా క్లుప్తపరచియున్నారు. "నన్ను సర్వసంపూర్ణముగా రక్షించుటకై, ఆయన తన సర్వ సంపూర్ణత్వముతో, నా సర్వమును స్వీకరించి, తన సర్వసంపూర్ణత్వముతో నా సర్వత్వమును ఐక్యమొందించెను. ఎందుకనగా అట్లుగానిచో దేని రూపము ఆయనచే స్వీకరించబడెనో, అది స్వస్థత నొందింపబడుటకు వీలులేదు." (21) అని గంభీరముగా నిరూపించుచున్నారు. "కాబట్టి ప్రతి దానిని పవిత్రపరచుటకై ఆయన ప్రతి వస్తువుయొక్క సామాన్య రూపమును దాల్చియుండెను" (22)



## 3 వ భాగము.

## ఆయన జీవితములో జేసునాథుని తిరుహృదయము.



**ఉపోద్ఘాతము: హృదయము ఒక చిహ్నము.**

దివ్య గ్రంథమునుండియు, ప్రారంభ శతాబ్ద వేదాచార్యుల వచనములనుండి ఏరుకొనబడిన వచనములును, మరియు వానిబోలి ఈ పుస్తకములో మేము వ్రాయని తదితర అనేక వచనములును, జేసునాథుడు మనోధర్మములు, అనురాగములుగల మానవ స్వభావమును, మన ఆత్మ రక్షణార్థమై ధరించెనని తేటగా తెలియజేయుచున్నవి. అవి ఆయన భౌతిక హృదయమునకుగూడ చెందినవేయని గాని, హృదయము ఆయన అనంత ప్రేమకు చిహ్నమనిగాని ఎచ్చటను స్పష్టముగా జెప్పియుండలేదు. సజీవమై, చిత్తవృత్తిగలిగిన మన ఆత్మకు ఏ మాత్రము తీసిపోక, భావచైతన్యముతోను ప్రేమానురాగములతో నిండి, తనరెండు స్వభావముల జ్వాజ్వల్యమానమగు దేవస్నేహముతోను, ఒప్పుచున్న ఆయన తిరుహృదయమునుగూర్చి సువిశేషకులుగాని, తదితర దివ్య రచయితులుగాని బహిరంగముగా నెచ్చటను వ్రాసియుండలేదు. గాని ఆయన దివ్యప్రేమను, దానితో సంబంధించిన ఇతర మానవ శక్తులకు సంబందించిన అంశములను తరచుగా, చాలినంత మేరకు వారు వెలుగులోనికి తెచ్చియున్నారు. అనగా ఆయన ముఖములోను, మాటలలోను, సంజ్ఞలలోను గన్పించిన కోరికలు, సంతోషము, దుఃఖము, భయము, కోపము మున్నగు భావోద్రేకములను గూర్చి తెలిపియున్నారు. ఆరాధనకు తగిన మన దివ్యరక్షకుని దివ్య ముఖము, ముఖ్యముగా ఒక విషయ సూచికను బోలియున్నది. ఆయన ప్రేమాగుణములు తన ముఖపుటద్దములో బహుగా ప్రతిభించెను. అవి ఆయన చిత్తమునందు వెవ్వేరుగా రేకెత్తి, విజృంభించిన సముద్రపు టలలు ఒడ్డునకు జేరునట్లు, ఆయన పవిత్రహృదయమునకు జేరి చలింపజేసినవి.

ఎందుచేతననగా తన సాధారణానుభవములో మానవ మనస్తత్వ శాస్త్రము, దాని ఫలితములనుగూర్చి అమరపండితుడు అక్వినాసు తోమాసుగారు బోధించిన లోతు భావములను ఇక్కడ కూడ ఉదహరించుట సమంజసముగా నుండును. "హృదయమున, ఆగ్రహముచే గావింపబడిన అశాంతి, శరీరములోని అంగమునకును వ్యాపించును. అందు విశేషించి హృదయానురాగములు ఏ యంగములో తేటగా కన్పించునో అట్టి అంగములైన కండ్లలోను, ముఖములోను నాలుకమీదను సాక్షాత్కరించును." అని చెప్పియున్నారు. (23) (హృదయభావములను ప్రదర్శించు రంగములు ఇంద్రియములని భావము).

కాబట్టి తన నిత్యపితను మానవులను, దివ్యరక్షకుడు మూడు విధములైన ఏ ప్రేమతో సదా ప్రేమించుచున్నాడో, ఆ ప్రేమకు మానవుడై జన్మించిన వార్తయొక్క హృదయము ఏకమై, ముఖ్య చిహ్నమేగాక సంజ్ఞారూపమనిగూడ నిర్వచించుటకు నిండుహక్కును కలిగియున్నది. ఎందుకనగా ఆయన పితతోను స్పిరితుసాంక్తుతోను గలిగియున్న ఆ దివ్యప్రేమకు, అది సంజ్ఞారూపకమేగాక "దైవత్వముయొక్క సర్వసంపూర్ణత క్రీస్తునందే శారీరకముగా నివసించుచున్నది." (కొల. 2:9). కాబట్టి రక్తమాంసములను దాల్చిన వార్తయైనవారి నాశకరమును, దుర్బలమునైన శరీరమునందె అది మనకు యివ్వబడియున్నది.

మరియు ఇది మిక్కిలి స్వాభావికమునై యున్నది. అనగా ఇంద్రియ వేద్యంబైన ప్రేమకుగూడా హృదయము సంజ్ఞారూపకమే అయియున్నది. ఎందుకనగా పరిశుద్ధ కన్యమరియాంబ గర్భములో రూపొందిన జేసునాధుని దేహము ఇతర మానవుని దేహముకంటె పరిపూర్ణమైన శక్తులను గలిగియున్నది.

ఇన్నికారణము లుండుటచేతనే కతోలిక విశ్వాసమును బోధించు ప్రమాణ గ్రంథములును ఈ క్రింది విధముగా బోధించుచున్నవి. జేసునాధునికిగల అతి పరిశుద్ధ మంచి మనస్సు నమ్మిక్యత గలిగి అత్యున్నతమైయున్నది. మానవుల రక్షణార్థము తన్ను సమ

ర్పించుకొనుట మూలముగా ఆయనయొక్క మువ్విధప్రేమ బయలు
పరచబడెను. ఈ కారణముచేత దివ్యరక్షకుని తిరుహృదయము మన
రక్షణకు నిజమైన గుర్తు సాక్ష్యమునైయున్నది. గాన ఈ హృదయము
నుగూర్చి ధ్యానించి గౌరవించుట న్యాయమైయున్నది. ఈ హృదయ
ము మన రక్షకుడైన దేవుని చెంతకు మనలను చేర్చు నిచ్చెనయై
యున్నది. కాబట్టి ఆయన మాటలు, పనులు, బోధనలు, అద్భుత
కార్యములు ముఖ్యముగా మనయెడల ఆయనకుగల స్నేహమును
రూపించుచున్న దివ్యసత్ప్రసాద స్థాపన, ఆయన బాధలు, స్లీవమర
ణము, తన పరిశుద్ధ తల్లియైన మరియమ్మను మనకు దానమిచ్చుట
మనకై తిరుసభను నెలకొల్పుట, చివరకు తన దివ్య స్పిరితును
అపోస్తులపైకిని, మనమీదికిని అంపుట మున్నగునవన్నియు ఆయన
సాటిలేని ప్రేమను ఋజువుచేయుచున్నవి. సువిశేషములో వ్రాయ
బడినట్లు పుట్టినది మొదలుకొని "గొప్ప శబ్దముతో నరచి, అంతయు
సమాప్తమాయెనని చెప్పి, తలవంచి మరణించెను" (మ. 27:50,
జ్వా. 19:30) అను నంతవరకు ఆయన తన లౌకిక యాత్రాకాల
మును ఆయన ప్రేమగల హృదయము మనకొరకు కొట్టుకొనుచుం
డెను. అందువలన మనమాయన తిరుహృదయమునుగూర్చి ధ్యానిం
చుట న్యాయసమ్మతమును సమంజసమునైయున్నది. స్లీవమరణము
తో ఆయన గుండెకొట్టుకొనుట ఆగిపోయినది. అందుచేత ఇంద్రి
యావేద్యంబగు ఆయన ప్రేమ, మరణమును జయించి, మరల సమా
ధినుండి లేచువరకు ఆటంకపరచబడినది. మరణమును జయించి
ఆయన నిత్యమహిమ శరీరమును దాల్చిన వెంటనే మరల దివ్య రక్ష
కుని ఆత్మ దానిలో ప్రవేశించెను. అప్పటినుండి ఆయన దివ్య
హృదయము నిత్యకాలమువరకును మనకొరకు కొట్టుకొనుచునే
యున్నది. అది నిత్యకాలము ఆటంకము అశాంతి నెరుగక మెలయు
చునే యుండును. అంతేగాక తన పితకును, మానవసంతతి యంత
టికిని సర్వేశ్వరుని సుతుడు చూపవలసియున్న ఆ త్రివిధ ప్రేమను
ప్రదర్శించుటలో అది ఇక ఎన్నటికిని ఆగబోదు. ఈ కారణముచేత
ఆయన మానవజాతికి పరమరహస్యమగు శిరస్సుగానుండ పూర్తి
హక్కును గలిగియున్నాడు.

రహస్యజీవితము—బహిరంగజీవితము.

గౌరవపాత్రులగు సోదరులారా! ఇప్పుడు ఈ భక్తిభావముల నన్నింటినుండి మెండుగా రక్షణఫలములను పొందుటకుగాను మన రక్షకుడైన జేసునాధునిహృదయమును, దైవమునగు హేరాళ అను రాగములను మనము చర్చించి ధ్యానించవలసియున్నది. వానిని ఆయన తన మానవజీవితములో ప్రత్యక్షముగా చూపించెను. ఇక ముందును ఎప్పటికిని చూపించుదురు. ఆ జ్ఞానవెలుగు ముఖ్యముగా మనకు సువిశేషమునుండి వచ్చుచున్నది. దానిచేత బలామొందింప బడిన పిదప, మనమాయన దివ్యహృదయమందసము లోనికి ప్రవేశింప సమర్థులమై అన్యజనాపోస్తలుడైన అర్చ్య. పౌలుగారితో నేకీభవించి "జేసుక్రీస్తునియందు ఆయన మనకుచేసిన ఉపకారము చేత తన కృపాసంపదా దైశ్వర్యమును" మనము కొనియాడుదుము.

మీరు ఆనతిచ్చిన ప్రకారము నాకు "అవునుగాక" యను ఉదారపూర్వకమైన మాటలను కన్యమరియాంబ గాబ్రియేలు దూతకు చెప్పుటచేత నరరూపుగా ఆరాధనీయమగు జేసునాధుని హృదయము, మానవమునను, దివ్యమునగు రెండు రకముల ప్రేమతో మెలయ సాగెను. అర్చ్య చిన్నప్పగారు వ్రాసిన విధముగా, అప్పుడె సర్వేశ్వరునివార్త ఈ లోకమునకు ప్రవేశించు నప్పుడు ఈ రీతిగా పలుకుచు న్నాడు. "బలియు సర్పణయు నీవు కోరలేదు: అయినను నాకొక శరీరము నమర్చితివి. పాప పరిహార దహనబలులును నీకిష్టము లేదు. అప్పుడు నేను వేదగ్రంథారంభములో నన్నుగూర్చి వ్రాయు బడినప్రకారము సర్వేశ్వరా మీ చిత్తము నెరవేర్చుటకు ఇదిగో! నేను వచ్చియున్నానంటిని.... జేసుక్రీస్తుని శరీరము ఒకసారి అర్పించ బడుటచేత దేవచిత్తమునుబట్టి మనము పరిశుద్ధపరచబడు చున్నా ము" (హెబ్రీ. 10, 5-7; 10 వ.) అదే విధమున ఆ హృదయము ఆయన నజరేతూరిలో తన గృహములో మరియమ్మ తల్లితోను కొయ్యపనిసాలలో సహాయము చేయుచు విధేయతగల బిడ్డగా మెల గుచు, సాకుడుతండ్రియైన జోజప్పగారితో పరలోక సంబంధమైన సంభాషణలను చేయునప్పుడును, మానవసంకల్పముతోను, అనురా గముతోను వానిని సంపూర్ణముచేయు దివ్యప్రేమతోను నిండియుం

జెను. మరియు పై జెప్పబడిన త్రివిధమైన ప్రేమతో, దీర్ఘమైన పాద యాత్రలు చేయుచు బోధించుచు, అనేక అద్భుతములను చేసి, చని పోయినవారికి జీవము నిచ్చి, ప్రతి విధమైన రోగములను కుదిర్చి, కాయకష్టముల కోర్చుచు, చమటకార్చుచు; ఆకలి దాహములచే పీడింపబడుచు, రాత్రులెల్ల నిద్రమేల్కొని జపించుచు; అనేక స్థలములలో బోధించుచు, సామెతల భావములను జెప్పి, అందు సర్వేశ్వరుని దయకు సంభందించినట్టి, పోగొట్టుకొనబడి నటువంటి రూక, చెదరిన గొఱ్ఱె, తప్పిపోయిన కుమారుడు, మొదలగు నుపమానములను వివరించుచు, మాటలలోను, క్రియలయందును, అర్చ్య గ్రెగోరి మహాత్ముడు చెప్పినట్లు సర్వేశ్వరుని హృదయమే కనపరచబడియున్నది. "నిత్య విషయములను మీరు అధిక మనఃపూర్వకముగా నాశించుటకై దైవవాక్కులలో సర్వేశ్వరుని హృదయమునుగూర్చి మీరు నేర్చుకొనుడు" (26) ఆయన హృదయము ప్రేమతో రగులుకొని మండుచు మాటలలో వెలువడుచుండెను. ఈ విషయమును గూర్చి అనేక ఉదాహరణములు గలవు. ఆకలి బాధతో అల్లాడుచున్న జనసమూహము ఆయన ఎదుట నిలిచి నప్పుడు "నాకీ జనసమూహముపైన కనికరము గలుగుచున్నది." (మార్కు. 8. 2.) అని జాలిగొనెను. తన పట్టణమైన జెరుసలేము పాపముతో నిండినదై నాశనమగుటకు లెక్కించబడి నప్పుడు "ఓ జెరుసలేమా, ఓ జెరుసలేమా, కోడి తన పిల్లలను తన రెక్కలక్రింద చేర్చుకొనునట్లు నేనును నా బిడ్డలను చేర్చుకొనవలెనని యెన్నిరో మారులు కోరితినిగాని నీ కిష్టములేక పోయెను." (మత్త 23: 37) అని దుఃఖభార హృదయముతో జెప్పెను. దేవాలయములో జరుగుచుండిన దేవద్రోహకరమగు వ్యాపారములను చూచునపుడు, తన తండ్రిపైగల ప్రేమతో, అపవిత్రపరచువారిపై పవిత్రాగ్రహముతో మండిపడుచు, "నా గృహము జపాలయమైయున్నది. గాని దానిని మీరు దొంగల గుహగా మార్చియున్నారు" (మత్త. 21:13) అను వేడిమాటలతో గద్దించెను.

స్లీవశ్రమలు మరణమున్నగు దృశ్యములు ముందుగానే ఆయన మనోనేత్రములకు ప్రత్యేకముగా సాక్షాత్కరించినపుడు

ఆయన హృదయము ప్రేమచేతను, భయముచేతను నిండియుండెను. ఆవరించరానైయున్న దుఃఖములనుగూర్చి, స్వాభావికముగా అనుభవింప ఇష్టములేని మరణమునుగూర్చి వెదనొందుచు "నా పితా! సాధ్యమైనచో యీ పాత్రను నా యొద్దనుండి తప్పించండి" (మ. 26:39) యని తన తండ్రిని బహు దీనతగా మొరపెట్టియున్నాడు. ద్రోహియైన జూదా ముద్దుపెట్టుకొనినపుడు, అత్యంత దుఃఖముతో నిండినవాడై, ఈ క్రిందివాక్యములతో అతనిని సంబోధించెను. "ఓ యిష్టుడా! నీవు వచ్చిన కారణమేమి? (మత్త: 26:50) "జూదానుడా! నీవు ముద్దుబెట్టి మనుష్యకుమారుని నప్పగించుచున్నావా?" (లూ: 22:48) శత్రువులకు నప్పగించువారిని చూచి స్నేహ హృదయముతో తన కడపటి ఆహ్వానముగా పై వాక్యములు గనబడుచున్నవి. స్లీవను మోసికొనిపోవునపుడు తన్ను వెంబడించుచున్న స్త్రీలను తన కరుణాప్రేమగల హృదయముతో "జెరుసలేము కుమార్తెలారా! మీరు నా నిమిత్తమై ఏడువక మీ నిమిత్తమును, మీ బిడ్డలనిమిత్తమును ఏడ్వుడి, ఎందుకనగా వారు పచ్చి మ్రాకుకే యీ విధముగా చేసియున్నప్పుడు, ఎండినదాని కేమిచేయుదురోగదా!" (లూకా: 23:28,31) అని ఆయన యనెను.

కడన స్లీవమ్రానుమీద వ్రేలాడునప్పుడు ప్రేమ దయాపూరమైమండెడు హృదయముగలిగి దివ్యరక్షకుడు పలికిన దేమనగా "ఓ పితా! వీరలను మన్నింపుము ఏలనగా వీరు చేయునదేమని వీరెరుగరు" (లూ. 23:34) "నా సర్వేశ్వరా! నా సర్వేశ్వరా నన్నేల చేయి విడిచితివి" (మ. 27:46) "నేడే నీవు నాతో పరమానందమున నుందువని నేను నీతో నిజముగా జెప్పుచున్నాను" (లూ. 23:43) "నాకు దాహమగుచున్నది" (జ్వా. 19:28) "ఓ పితా! నా ఆత్మను నీ హస్తములకు నప్పగించుచున్నాను" (లూ. 23:46)

అయినను ఆయన చూపిన ప్రేమయొక్క బాహుళ్యతను సమగ్రముగాను, యోగ్యముగాను ఎవరు వర్ణింపగలరు? మరి ముఖ్యముగా దివ్య సత్ప్రసాద దేవద్రవ్యానుమానముద్వారా తనకుతానే ఈవిగా త్యాగమొనర్చుట, తన మహా పరిశుద్ధమాతను మానవులకు

దానమిచ్చుట, గురుత్వముద్వారా మనతో సహజీవనము జేయుట మన్నగు మహాదానములను జనుల కిచ్చు మహా పుణ్యాగడియలో ఆయన తిరు హృదయ మెంతగా నుప్పొంగి ప్రేమతో నుండుచుండెనో ఎవరు ఊహించగలరు? ఆయన హృదయప్రేమానురాగములను మన కెవరు వినిపించగల్గుదురు? తన శరీరము నర్పించి, రక్తమును చిందించుటద్వారా నూతన నిబంధనను ప్రతిష్ఠించవలెనని, ఆయన తలంచిన దేవద్రవ్యానుమాన రూపకముగా తన శిష్యులతో కూర్చుని కడరాభోజనము చేయుటకు మున్ముందుగానే ఆయన తిరుహృదయము ప్రేమకోరికలతో పొంగుచుండెను. ప్రేమాతురంగములతో నుజ్జ్వాతలూగిన ఆయన హృదయ కోరికలను ఆయన తన అపోస్తులతో పల్కుచున్నాడు, వినుడు. "నేను పాటుపడక మునుపు మీతో ఈ పాస్కాను భుజింపవలెనని మిక్కిలి ఆశపడితిని" (లూకా. 22:15) "పిమ్మట ఆయన అప్పమునందుకొని కృతజ్ఞతాస్తోత్రములు సలిపి దానిని త్రుంచి వారల కిచ్చి: ఇది మీ కొరకు కియ్యబడెడు నా శరీరము, నన్ను జ్ఞాపకము చేసికొనుటకై దీని చేయుడనెను. భోజనమైనతరువాత అదే విధముగా పాత్రమునందుకొని ఈ పాత్రము మీ కొరకు చిందించబడు నా రక్తమువలనైన నూతన నిబంధనగానున్నది యనెను" (లూకా. 22:19-20) ఆయన ప్రేమ ఎంతబలవత్తరమైనదో ఈ మాటలలో మనకు తెలియుచున్నది.

కాబట్టి దివ్యసత్ప్రసాదము ఒక దేవద్రవ్యానుమానమును, బలియునై యున్నది. మొదటిరూపములో ఆయన దానిని మానవులకు అనుగ్రహించుచున్నాడు; రెండవరూపము తానై తనకు దానే తనను "సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయమువరకు ఎడతెగక బలిగా నొసంగుచున్నాడు" అందుచేత పై రెండురూపములేగాక గురుపట్టముగూడ జేసుక్రీస్తునాధుని పవిత్ర హృదయము యొక్క "దానము" అనబడుటకు అర్హమై యున్నదని మేము నిరూఢపరచుచున్నాము.

ఇంతకు మునుపు పైన మేము చెప్పినట్లు సర్వేశ్వరునియొక్కయు, మనయొక్కయు ప్రియమాతయగు పరిశుద్ధమరియమ్మ, జేసునాధుని మిక్కిలి పరిశుద్ధహృదయ మొసంగు అమూల్యంబగు

మరొక దానమగును. ఎందుకనగా శరీరక రీత్యా ఆమె మన దివ్య రక్షకుని తల్లియైయున్నది. ఆదితల్లియైన హేవమ్మ సంతానమును దేవవరప్రసాద జీవమునకు రమ్మని మరల పిలుచు కార్యములో జేసునాథునితో నేకీభవించి సహకరించినందుచేత ఆమె మానవసంతతి కంతటికిని "ఆత్మీయమాత" యైయున్నది. ఈ సందర్భములో అర్చ్య. అగుస్తీనువారు "మనము రక్షకుని శరీర అవయవములైయున్నాముగనుక మనకామె నిజముగా తల్లియగుచున్నది. ఎందుకనగా ఆత్మలకు ఎవరు అవయవములో తిరుసభలో అట్టి విశ్వాసులు పుట్ట గలుగునట్లు స్నేహముతో ఆమె సహకరించుచున్నది" అని నిరూఢ పరచుచున్నారు.

ఇంతియేగాక సన్నిహితమును శాశ్వతమునైన తనయొక్క స్నేహమునకు ముఖ్యమగు నిదర్శనముగా మన రక్షకుడైన జేసు నాథుడు గోధుమ అప్పము ద్రాక్షారసము రూపములో రక్తము చిందని బలియగుచు, స్లీవమానిపై రక్తము చిందినబలితో నేకీభవింపవలయునని తాను సంకల్పించుకొనెను. ఈ విధముగా జేయుట తన ఉన్నత, ఉత్తమ, ఏకైక ప్రేమయొక్క గమ్యస్థానమునకు ఉదాహరణమని తన శిష్యులకు క్రీస్తుస్వామి ప్రతిపాదించినట్లు మనకు గ్రాహ్యమగుచున్నది. ఆ భావమే ఈ క్రింది సువిశేషవచనములో వ్యక్తమగుచున్నది. "తన స్నేహితులకొరకు ప్రాణము నిచ్చుటకంటె ఎక్కువ ప్రేమను కలవాడెవడును లేడు" (జా. 15:13) కాబట్టి గొల్గతాకొండపై తాను సమర్పించిన రక్తబలిద్వారా సర్వేశ్వరుని సుతుడగు జేసునాథుని ప్రేమ, సర్వేశ్వరుని ప్రేమనే తేటగను అర్థవంతముగను లోకమునకు సాక్షాత్తుగా ప్రదర్శించెను. దీనినే అర్చ్య. జ్వాన్నేను తన నిరూపములో "సర్వేశ్వరుడు మన కొరకు తన ప్రాణము నిచ్చెనుగనుక దీనివలన ఆయన ప్రేమ యెట్టిదని మనము తెలిసికొనుచున్నాము. అందుచేత మనము కూడా మన సహోదరుల నిమిత్తమై మన ప్రాణములను నీయబద్ధులమైయున్నాము" (1 జ్వా. 3:16) అని వ్రాసియున్నాడు. కనుకనే మన దివ్యరక్షకుడు తనను స్లీవవేయు వారి బలాత్కారమునకంటె ఎక్కువగు తన ప్రేమా నిర్బంధము చేతనే తననుదాను స్లీవకొయ్యకు అతుకబెట్టుకొనియు

న్నాడు, మరియు ఆయన ఉత్తమోత్తము నైన స్వీయం సమర్పణా యాగమే తన అత్యుత్తమమైన ఈవియగుచున్నది. దానినే ఆయన ప్రత్యేకొక్కనికిని అనుగ్రహించెనని ఈ క్రింది వాక్యములో తెలిపెను. "ఆయన నన్ను ప్రేమించి, తనంతటతానే నాకై అర్పించుకొనెను" (గలసీ. 2:20)

కాబట్టి మనము లోతుగా నాలోచించిన జేసునాథుని మిక్కిలి పరిశుద్ధ హృదయము, మనుష్యావతారమెత్తిన దివ్యవార్త యొక్క జీవితములో భాగస్వామ్యముగలిగియున్నందుచేత తన మానవస్వభావములోని ఇతర అంగములవలె దేవవరప్రసాద కార్యమునేగాక ఆయన సర్వశక్తినిగూడా నిర్వహించవలసిన దైవత్వము యొక్క కార్యసాధన ఉపకరణముగా రూపొందవలసియున్నదని మనము సందేహింపజాలము.

"తిరుసభను తన పత్నిగా జేసుకొనుటకై గల ప్రేమవలననే శ్రమ బాధల ననుభవించెను" అను వాక్యమునకు సరిగా ఆయన తన దివ్య రక్తమును చిందించి తాను వరించబోవు పెండ్లికుమార్తెయైన తిరుసభయెడల అపూర్వప్రేమకు సాహసించెను. కాబట్టి అంతటి అపూర్వప్రేమకు జేసునాథుని తిరుహృదయము నిజముగా సంజ్ఞారూపము గూడా అగుచున్నది. లోతుగా గాయములు పొందిన ఆ తిరుహృదయమునుండియే పాపప్రాయశ్చిత్తార్థమైన రక్తమును మానవలోకమునకు పంచి ఇచ్చు తిరుసభ జనించియున్నది. "స్లీవపై గాయపడిన క్రీస్తుహృదయమునుండియే తిరుసభ బయలుదేరియున్నది.... ఆమె ఈ హృదయ (జీవజలముల) నిధినుండి దేవవరప్రసాదములను అనుగ్రహించుచున్నది." (తిరుహృదయపండగనాటి సాయంకాల జపకీర్తన) కాగా తిరుసభ బిడ్డలకు అందునుండియే జ్ఞానజీవము నిచ్చు దేవద్రవ్యానుమానముల వృక్షముల వరప్రసాదపు టూటలు పొంగి పారుచున్నవి.

ఈ సంజ్ఞారూపకము (చిహ్నము) యొక్క ఈ యర్థమును మన దివ్యవేద ప్రాచీన ఋషులును, వేదాంత శాస్త్రజ్ఞులును, ఎరిగియేయున్నారు. వారందరి వచనములను మరల ప్రతిధ్వనింప జేయుచున్నాడో యనునట్లు పండితుడగు అర్చ్య. తోమస్ అక్వినాస్

ఇట్లు వ్రాయుచున్నాడు;—"క్రీస్తునాథుని ప్రక్కలోనుండి ప్రక్షాళ
నార్థము నీరును పాపవిమోచనార్థము రక్తమును స్రవించుచున్నవి.
కాబట్టి రక్తము దివ్య సత్ప్రసాద దేవద్రవ్యానుమానమునకును నీర
ము జ్ఞానస్నానమను దేవద్రవ్యానుమానమునకును జెందియున్నది.
అయినప్పటికిని రక్తప్రభావమునుండియే శుద్ధీకరించు శక్తిని ఈ నీరు
పొందియున్నది" (20) "గాయపరబడి, తెరవబడెను" అని ఆయన
ప్రక్కనుగూర్చి చెప్పబడినది. వాస్తవముగా భటుని బల్లెపు పోటు
తో బొడువబడి గాయపర్చబడిన క్రీస్తునాథుని తిరుహృదయమును
గూర్చియే చెప్పబడియున్నది. ఎందుచేతనగా సిలువవేయబడిన క్రీస్తు
నిజముగా మరణించెనో లేదో యని రూఢిగా తెలియుటకొరకే—అం
దుకుమాత్రమే— ఆ భటుడు ఆ బల్లెమును ప్రయోగించెను. ఇందు
చేత జేసునాథుని మిక్కిలి పరిశుద్ధ హృదయము ఆయనయొక్క ఈ
లోక జీవితాంతరము యుగయుగముల పర్యంతరము మానవ పాప
విమోచనార్థము, దేవుడు తన ఏక కుమారుని కనుగ్రహించిన
ప్రేమయొక్క సజీవ ప్రతిబింభముగా నుండవలసియుండెను. దాని
తోనే తన రక్తమును కడపటి బొట్టువరకు కపాలకొండపై సిలువ
మ్రానిమీద చిందించి పూర్ణాహుతిగా నొసగినంతటి మునుపూర్వ
కమగు గాఢప్రేమతో క్రీస్తునాథుడు మనలనందరిని ప్రేమించెను.
అర్చ్య. చిన్నప్పగారు చెప్పినట్లు "క్రీస్తు మనలను ప్రేమించి, పరి
మళవాసనగా నుండుటకు మనకొరకు తన్ను సర్వేశ్వరునికి సమర్ప
ణముగాను బలిగాను అప్పగించుకొనెను" (ఎఫే. 5:2)

### మహిమాన్విత జీవితము.

మన దివ్య రక్షకుడు మోక్షారోహణమైన వెనుక మహిమాన్విత
శరీరముతో పితయైన దేవుని కుడి పార్శ్వమున ఆసీనులైన పిమ్మట
కూడా, ఆయన హృదయానురాగమైన ప్రేమతో, తిరుసభా సతిని
ప్రేమించుటకు మరువ లేదు. ఎట్లనగా ఆయన సైతాను పైనను,
పాపము పైనను, నరకము పైనను పొందిన త్రివిధ విజయములకు
గుర్తుగా నున్న గాయాల ముద్రలు ప్రకాశించుచునే యున్నవి.
అదే రీతిని అమూల్య బొక్కసమును బోలి, తన తిరు హృదయ
ములో మానవ సంతతికై సంపాదించిన త్రివిజయ ఫలములను,

అనగా తాను సంపాదించిన పుణ్య ఫలములను దాచియుంచి పరమ ఉదారతతో ప్రసాదించు చున్నారు. ఈ సత్యము అన్య జనాపోస్తులు దీనిని ఈ క్రింది వాక్యములో కూర్చి యున్నాడు. "ఆయన ఉన్నత స్థలమునకు నెక్కిపోయినప్పుడు, చెరను చెరగా పట్టుకొని పోయి మనుష్యులకు దానము లిచ్చెనని" వేదము చెప్పుచున్నది. క్రిందికి దిగినవాడు తాను సమస్తమును నింపునట్లు ఆకాశ మండలముల కన్నిటికంటె మరి పైకి ఎక్కిపోయెను. (ఎపెసి 4 : 8,10)

తన పితయొక్క కుడి పార్శ్వమున కారోహణాంతరమున, స్పిరితుసాంక్తు సర్వేశ్వరుని తన అపోస్తుల మీదకు పంపించుట యను యీవి కూడా తనయొక్క అత్యంత స్నేహమునకు ముఖ్య గురుతుగా నున్న విషయము మనకు తేటగా తెలియును. కడరా భోజన సమయమున "నేను పితను మనవి చేయుదును, మీతో సదా నుండుటకు వేరొక ఓదార్చెడు వానిని మీకు అనుగ్రహించు ను" (జ్వా: 14:16) అని ఆయన తన శిష్యుల కిచ్చిన వాగ్దానము ప్రకారము తన స్వర్గారోహణా నంతరము, పదియవ దినమున, పిత యైన, దేవుడు ప్రసాదించిన ఆదరణ కర్త మేడ పై గదిలో కూడి యున్న అపోస్తుల పైకి దిగివచ్చెను. మరియు ఈ ఆదరణ కర్త, నిశ్చయముగా పిత సుతుని ఎడలను, సుతుడు పిత యెడలను గలిగియున్న పరస్పర ప్రేమయై యున్నాడు. ఆయన యిరువురివలన పంపబడి యున్నాడు. ఆయన అగ్ని నాలుకల రూపము దాల్చి వారల మనో క్షేత్రముల, దేవ వరప్రసాదములను మోక్ష సంబంధమైన ఇతర వరములను క్రుమ్మరించు చుండును. జేసునాథుని హృదయమునుండియే దేవ ప్రేమ జనించినది. "బుద్ధి, జ్ఞానము సర్వ సంపదలు ఆయన యందే గుప్తములై యున్నవి." (కొలస్సు 2:౩) ఈ దేవప్రేమ జేసునాథుని హృదయము యొక్కయు, ఆయన ప్రేమయైన స్పిరితు సాంక్తు యొక్కయు వరమై యున్నది. ఈ ప్రేమ స్పిరితు లేక పరిశుద్ధాత్మ నిశ్చయముగా తండ్రి కుమారుల నుండి బయలు దేరి యున్నాడు. ఆ స్పిరితు మూలముగానే తిరుసభ జనించినది. సత్యవేదము లోకమంతటా అన్యజనులకు ప్రకటించబడు చున్నది. విగ్రహారాధన, క్రోధము, అశుద్ధ ఆచారముల వలన

మలినమొంది మూలుగుచున్న వారికి ఆ స్పిరిటు వలననే సత్య వేదము ప్రకటించ బడుచున్నది. దైవ ప్రేమ, క్రీస్తునాధుని హృదయము యొక్కయు స్పిరిటు సాంక్తు యొక్కయు వెలలేని యీవియై యున్నది. ఈ యీవిని పొంది బలము గల అపోస్తులులును, వేదసాక్షులును చావునకు భయపడక వీరాగ్రేసరులవలె పోరాడిరి. తమ రక్తము చిందునంత వరకును భయమును నొందక సువార్తను ప్రకటించ గలిగిరి. ఈ స్పిరిటు తిరుసభ పండితుల మానసములను వెలిగించి బోధించుటకు అత్యంత శక్తి ననుగ్రహించెను. దైవ వరములవలన తిరుసభ ఆచార్యులు పుస్తకములు వ్యాఖ్యానించు శక్తిగలిగి సువార్తై, పౌరుషవార, నత్య, పవిత్ర, మొదలగు కొరకు తమ్ము తాము వ్యయము పరచుకొనగలిగిరి. ఈ దైవ వరము వలననే కన్యకామ తల్లులు ఇంద్రియ సుఖములను యిష్టాను సారముగా నిగ్రహించి మోక్షభర్తయొక్క ప్రేమకు పూర్ణముగా లోబడ జేసుకొనిరి.

పవిత్రాసుడైన వారియొక్క హృదయమునుండి, స్పిరిటుసాంక్తువుచే విశ్వాసుల హృదయములలో రేపబడుచున్న ఈ దివ్య స్నేహమును గౌరవించుటకును, మానవుల మధ్య దివ్య స్నేహరాజ్య వ్యాపకమును అరికట్టు దుష్ట శక్తులపై జేసునాధుడు సాధించిన విజయములను స్తుతించుటకును, అన్య జనాపోస్తులుడైన చిన్నప్పగారు ఈ క్రింది విజయ గీతికను రచించి యున్నారు. "అట్లుండగా, క్రీస్తుని ప్రేమనుండి మనలను ఎడబాపు వాడెవడు? దురితమా, దుఃఖమా ఆకలియా. నిర్వాణమా అపాయమా, హింసా లేక కత్తియా? ఇందును గూర్చి వ్రాయబడి యుండునదేమనగా మేము నీనిమిత్తము దినమెల్ల చంపబడు చున్నాము. వధకు గొనిపోబడు గొర్రెలుగా ఎంచబడు చున్నాము." అయినను మనలను ప్రేమించెడి వానిని గొని మనము వీని నన్నిటిలో జయము పొందు చున్నాము. ఎందుకనగా, మరణమైనను, దేవ దూతలైనను, ప్రధానులైనను, బలవంతులైనను, వర్తమానవస్తులైనను, రాబోవునవియైనను, పరాక్రమమైనను, ఎత్తయినను, లోతైనను, మరి యే సృష్టివస్తువైనను, మన నాధుడైన జేసునియందలి దేవ ప్రేమనుండి మనల నెడబాప నేరవని రూఢిగా నమ్ముచున్నాము." (రోమా. 35, 37-39)

కాబట్టి మానవులయెడల తనలో రగులుకొని మండు చున్న అశేష స్నేహమందు భాగ స్వామ్యము గలిగిన దివ్య రక్షకు డగు జేసునాథుని, పవిత్ర హృదయమును ఆరాధించుటకు మనలను ఏదియు ఆటంకపరచలేదు. ఎందుకనగా తిరుహృదయముపై ఈ లోక జీవిత ఆటంకములకు, ఇక మరెన్నటికిని అధికారము లేకపోయి నను, అది ఇంకను జీవించుచు, హెచ్చుగా మనకొరకు కొట్టుకొ నుచు, దివ్య వార్తయైన వ్యక్తిలో ఐక్యమొంది యున్నది. కాబట్టి క్రీస్తు హృదయము దివ్యమును మానవమునగు ప్రేమతో నిండి పొర్లి పారుచున్నది గనుకను, తన భౌతిక జీవితములో తన శ్రమల ద్వారాయును మరణముద్వారాను, మన దివ్యరక్షకుడు సము పార్జించిన కృపావరములకు అది ధనాగారమై యున్నందువలనను; తన జ్ఞాన శరీరముయొక్క అవయవములపైన స్పిరితుసాంక్తు క్రుమ్మ రించు స్నేహముయొక్క నిర్విరామ ప్రవాహకమగు జీవజలముల ఊటయైయున్నది.

కాబట్టి మన రక్షకుని హృదయము, ఒక విధముగా వార్తా దివ్యవ్యక్తిని ప్రతిబింబింప జేయుటేగాక, తన రెండు స్వభావముల తోగూడా అనగా దివ్యస్వభావముతోను మనుష్యస్వభావముతోను ప్రతి బింబించుచున్నది. మరియు దివ్యహృదయము రక్షణ కార్య సం పూర్ణ పరమరహస్యము యొక్క చిహ్నమేగాక, మానవ విమోచన కార్యసారసంగ్రహమనిగూడా మనము లోతుగా భావింపవలయును. జేసునాథుని తిరుహృదయమును మనము ఆరాధించునపుడు, దాని లోను, దాని ద్వారాయును, దివ్యవార్తయొక్క సృజంపబడని ప్రే మను, దానితోపాటు దానియొక్క సృజింపబడిన మానవప్రేమను, దాని ఇతర అనురాగములను పుణ్యములనుగూడా ఆరాధించుచు న్నాము. ఏలననగా ఆ రెండుప్రేమలు, మనకొరకును విశ్వజనీనమైన తిరుసభ యను తన పత్నికొరకును, మన రక్షకుని తన్నుతాను సమ ర్పించుకొన ప్రేరేపించియున్నవి. దానినిగూర్చి అపోస్తులుడైన చిన్న ప్పగారు "........అటువలె క్రీస్తు తిరుసభను ప్రేమించి దానికొరకై తనను నప్పగించుకొనెను. ఏలనగా క్రీస్తుడు జీవముగల వాక్యముతో జలస్నానముచేత దానిని కడిగి పరిశుద్ధపరచుటకును, మరకయైనను,

ముడుతయైనను, అట్టిది మరేదైనను లేక, పరిశుద్ధమైనదిగాను నిర్దో షమైనదిగాను, మహిమగల సభగాను, తన యెదుట దానిని నిలువ బెట్టుకొనుటకును తనను అప్పగించుకొనెను" (ఎఫే 5. 25–27) అని చక్కగా వర్ణించియున్నాడు.

క్రీస్తు తిరుసభను మున్నెంతగా ప్రేమించెనో అంతగా మేము పేర్కొనిన యట్టి మువ్విధ ప్రేమతో మిక్కిలి మనఃపూర్వకముగా దానిని ఆయన యింకను ప్రేమించుచునేయున్నాడు. అట్టి ప్రేమ చేత ప్రేరేపింపబడినందువలననే "ఆయన పితయొద్ద మనపక్షమున వాదింప నీతిమంతుడైన జేసుక్రీస్తుని కలిగి" (1 జ్వా. 2,1) యున్నాము. మరియు ఆయన మనకొరకు విజ్ఞాపనము జేయుటకు నిరంతరము జీవించుచున్నాడు గనుక తన మూలముగా సర్వేశ్వరునియొద్దకు వచ్చు వారలను సదా రక్షించుటకు శక్తిమంతుడైయున్నాడు" (హెబ్రి: 7;25) ఆయనయొక్క తరగని ప్రేమనుండి, బయలుదేరి మన పక్షమున సర్వేశ్వరునికి సమర్పించబడునట్టి ప్రార్థనలు ముందెన్నటికి గూడ ఆటంకపరచబడజాలవు. మునుపు "ఆయన శరీరమున జీవించు దినములలోవలె" (హెబ్రి: 5:7) యిప్పుడుగూడా పరలోకములో విజయవంతముగా తనతండ్రిని ప్రార్థించుచునేయున్నాడు. "సర్వేశ్వరుడు భూలోకమును ఎంతో ప్రేమించెననగా, తన యేక సుతుని యందు విశ్వాసముంచెడువారందరు నశింపక నిత్యజీవము పొందుటకై సర్వేశ్వరుడు ఆయన నిచ్చెను" (జ్వా. 3:16) రోమీయ భటునిచే నొక బల్లెముతో గాయపరచబడినపుడు ఆయన హృదయము లో రగులుకొని మండిన ప్రేమకంటె ఎక్కువైన ప్రేమను ఆయన నేడు చూపించుచున్నాడు. దానినిగూర్చి ఒక భక్తుడు "అదృశ్య మగు ప్రేమగాయమును మేము చూచునట్లు (నీ హృదయము) గాయమొందియున్నది" అని భావగర్భితముగా వచించియున్నాడు.(31) "సొంత సుతుని సైయితము వెనుదీయక మనందరికొరకై ఆయనను అప్పగించినవాడు ఆయనతో సమస్తమును మన కెందుకు అనుగ్రహింపడు?" (రోమా. 8:32) కాబట్టి మన పరలోకపు తండ్రి, గాఢాతిగాఢమగు నట్టి ప్రేమగల ఉత్తరవాదిని బట్టి మానవులందరిపై వర ప్రసాదములను కురిపించ నెన్నడు మానడు.

## 4 వ భాగము.

## తిరుసభ చరిత్రలో జేసునాథుని తిరుహృదయము.

**ఉపోద్ఘాతము:**

గౌరవనీయ సోదరులారా!

జేసునాథుని హృదయభక్తియొక్క అంతరంగ స్వభావము గూర్చియు, ఆ హృదయమునుండి ప్రవహించు వరప్రసాదముల సంపదనుగూర్చి మీకును క్రీస్తుప్రజలకును బోధింప దలంచితిమి. ఈ బోధనకు దేవుడు తెలియజేసిన సత్యములే మూలాధారమైయున్నవి. సువిశేషమునుండి తీసుకొని మీకు బోధించిన విషయముల మూలముగా, ఈ భక్తికృత్యము క్రొత్తదికాదని మీకిపుడు తేటగా తెలిసియుండును. ఈ భక్తిసాధన అవతారుడైన వార్తయొక్క దివ్యమును, మానవమునగు ప్రేమయొక్కయు, మరియు పితయైన సర్వేశ్వరుడును, స్పిరితుసాంతువైన సర్వేశ్వరుడును పాపులపై ఏ ప్రేమతో పరామర్శించుచున్నారో ఆ ప్రేమయొక్కయు భక్తిసాధనకంటె ఇతరము కానేకాదు. అర్చ్య. తోమాసుగారు నుడివినట్లుగా పరిశుద్ధ త్రియేక దేవునినుండి ప్రవహించు మానవ రక్షణాన్వితమైన ప్రేమ జేసునాథుని మానవసంకల్పముమీదను, ఆయన ఆరాధ్యహృదయము నిండియున్నది. మనలను పాపదాస్యమునుండి విడిపించుటకు ఆ ప్రేమయే ఆయనను బలవంతపరచెను. ఈ భావమునే మన దివ్యరక్షకుడు "నేను చేయవలసిన స్నానమొకటి కలదు. అది నెరవేరువరకు నేనెంతో నిర్బంధపడుచున్నాను." (లూ: 12:50) అని తెలియపరచియున్నాడు.

మానవజాతికొరకు స్లీవవేయబడిన మన దివ్యరక్షకుని హృదయ సంజ్ఞారూపములో మనము మానవులయెడల సర్వేశ్వరునికిని, జేసునాథునికినిగల దివ్యప్రేమను గౌరవించుచున్నాము. కాబట్టి యిట్టి తిరుహృదయ భక్తిసాధన విశ్వాసులకు పూర్తిగా నూతనమైనదిగాదు. గాని మన యుగమునకు ముందటి అనతికాలములోనే ఆ భక్తిసాధన అద్భుత రీతిగా సర్వత్రా ప్రచారము గావింపబడినది. అందును ముఖ్యముగా, జేసుస్వామి తన బిడ్డలలో తనకు దూతగాను ప్రచారకులుగాను ఆయనచే నెన్నుకొనబడిన కొందరికిమాత్రము

యీ రహస్యమును ప్రత్యేకముగా బయలుపరచి వారికి అనేక దైవ కృపావరములను అనుగ్రహించుటతో ఈ భక్తికార్యము ప్రపంచ మంతటా ప్రాకిపోయెను.

చారిత్రక పురోగతి.

ఎందుకనగా పరిశుద్ధ దేవమాతయొక్కయు, అపోస్తులుల యొక్కయు, సుప్రసిద్ధులగు వేదస్థులయొక్కయు ఆధర్మమును [illegible] వారి అడుగుజాడలను వెంబడించుచు, జనులు, ముఖ్య ముగా దైవప్రజలు క్రీస్తునాథుని మానవ స్వభావమునకును, ప్రత్యే కముగా ఆయన దేహమును చీల్చిన గాయములకును అరాధన, కృతజ్ఞత ప్రేమా కానుకలను చెల్లించకుండిన కాలము నిశ్చయముగా లేనే లేదు.

అదియునుగాక అపోస్తులుడైన అర్చ్యి. తోమాసుగారు "నా ఏలినవారా! నా సర్వేశ్వరా!" (జ్వా: 20:18) అని పలికిన వాక్యములే ఆయనను అవిశ్వాస స్థితినుండి విశ్వాస స్థితికి మార్చె నని ప్రకటించలేదా? మత విశ్వాస జీవన ప్రదర్శనము, ఆరాధన, ప్రేమ, ఆ ప్రార్థనా వాక్యములలోనే అణగి ధ్వనించినవి. జేసునా థుని మానవ స్వభావ గాయములను గాంచిన అర్చ్యి. తోమస్ పరి శుద్ధ దివ్య వ్యక్తియొక్క సార్వభౌమత్వమునుగూడా నిస్సందేహ ముగా నంగీకరించినట్లు ఆ మాటలు సూచించలేదా?

"వారలు తాము పొడిచిన వానితట్టు వీక్షించుదురని" (జ్వా: 19:37 జకరియా 12:10) జకరియా దీర్ఘదర్శిచే ప్రవచించ బడి, అపోస్తులుడైన అర్చ్యి. జ్వాన్నేసుచే వ్రాయబడిన వాక్యములు యుగయుగములలో జీవించు విశ్వాసులెల్లరికిని వర్తించుచున్నవి. గాన మానవసంతతియంతయు దేనిచే కౌగలింపబడినదో అట్టిదియు నగు ఆయన ప్రేమను సన్మానించి గౌరవించుటకు, స్లీవవేయబడిన రక్షకుని హృదయముచే మానవులు శక్తివంతముగా ఆకర్షింపబడి నప్పటికిని, ఒక సంగతిమాత్రము మనము మరువవలదు. అది యేద నగా:—తిరుహృదయమును, అవతారుడైన వార్తలో వసించిన మాన వమును దివ్యమునగు ప్రేమాప్రతిబింభముగా నారాధించుటయు, ఆ హృదయ భక్తి అభ్యాసములు క్రమేణ నెమ్మదిగానే వృద్ధి అయి

నవని మనము ఒప్పుకొనక తప్పదు.

అయినప్పటికిని ఈ భక్తి యింత ప్రాముఖ్యతకు వచ్చిన ముఖ్యదశలను తెలుసుకొనగోరువారికి, దాని నాయకులుగా ప్రసిద్ధి కెక్కిన కొందరి వ్యక్తులపేర్లు మనస్సునకు తట్టకమానవు. ఈ భక్తి కృత్యము మొదటినుండి బహు నెమ్మదిగా సాగియున్నను క్రమక్రమముగా మతోద్యమముల ఆదరాభిమానములను చూరకొనుచునె యుండెను. జేసు తిరుహృదయ భక్తి అభివృద్ధికి వ్యాపకమునకు అత్యంత కృషి సలిపినవారిలో ప్రముఖులు, అర్చ్య. బొనవెంతూర్ అర్చ్య. ఆల్బర్టు, అర్చ్య. జత్రుత, సియెన్నాపురి అర్చ్య. కత్తరీనమ్మ పరిశుద్ధ హెన్రీనూసో, అర్చ్య. పేత్రుకనీసియుస్; అర్చ్య. ప్రాంసిస్ దెసెల్సు, అర్చ్య. జాక్ యూదెస్ అనువారలని మేము చెప్పగలము. చాలామంది ప్రాన్సుదేశ పవిత్ర పీఠాధిపతుల అంగీకారము పొందినతరువాత జేసునాథుని తిరుహృదయ భక్తి మహోత్సవము ప్రప్రథమముగా 1672 సం॥ అక్టోబరునెల 20 వ తేదీన కొనియాడబడెను. ఈ పండుగకు సంబంధించిన జపములు అర్చ్య. జాక్ యూదెస్ అనువా రచించినవియే. అయినను ఈ భక్తిసాధనను పెంపొందించినవారల పేర్ల పట్టికలో ప్రథమస్థానము నిస్సందేహముగా అర్చ్య. మర్గరీతమరియమ్మగారికే యివ్వవలసియున్నది. ఎందుకనగా తనలో భక్తిని రగిలించిన తన ఆత్మగురువగు పరిశుద్ధ క్లాదె దెల కొలంబీరె అనువారి సహాయము పొంది అత్యమూల్యమగు నీ భక్తి రూపమును ఆ పుణ్యవతియే విశ్వాసులకు సాక్షాత్కరింప జేసెను. అందునుగూర్చియే ఆమె యావత్ ప్రపంచ విశ్వాసుల ఉన్నతాభివందనలకు అర్హురాలైన సంగతి అందర మెరింగిన విషయమే. ప్రేమ పరిహారము, ఈ భక్తి కృత్యములో ప్రత్యేక లక్షణములై యున్నందున దీనిని తదితర భక్తి రూపములకంటె ఉత్తమమైనదిగా భావించవలసియున్నది,

## చారిత్రక వ్యాఖ్యానములో హెచ్చరిక!

క్రీస్తుమతము ప్రేమా (మయమగు) మతము. అట్టి మతసారముతో అత్యంత సంబంధము, పొత్తు, కల్గినందుచేతనే తిరుహృదయ భక్తివ్యాపకమునకు, అభివృద్ధికి కారణమైనది. దానిని తెలిసి

కొనుటకు ఎప్పుడు తిరుహృదయభక్తి పెంపొందుచుండెనో ఆయుగ మును మన మనసుకు జ్ఞప్తికి తెచ్చుకొనుటచాలును. కాబట్టి సర్వేశ్వరుడుదీనిని రహస్యముగా నెరిగించెననిగాని, లేక అది తిరుసభలో నాకస్మికముగా ఉత్పన్నమైనదనిగాని మేము చెప్పజాలము. అది సజీవ మును భక్తియుతమునైన విశ్వాసమునుండియె దానియంతట అదియే రూపొందియున్నది. మానవులు జ్ఞానవరములు పొందినవారై, రక్షకుని మాత్రమేగాక ఆయన అపారప్రేమకు సాహ్యానిరూపణలును, మానవ కఠిన హృదయములను కరిగించి కదలించునవియైన ఆయన దివ్యగాయములను సహా వందించుటకును ప్రేరేపింపబడియున్నారు. కాబట్టి పై విషయములనుబట్టి తేటతెల్లముగా మనకొక విషయము తెలియుచున్నది. అది ఏదనగా అర్చ్య. మర్గరీత మరియమ్మకు తెలియజేయబడిన సత్యములు, కతోలిక మత సిద్ధాంతములకు భిన్నమైన క్రొత్తసత్యములను ప్రదర్శించియుండలేదు. అయినను ఆ ప్రకటన ప్రాముఖ్యత ఈ క్రింది విషయములో నణిగియున్నది. అది ఏదనగా: తన పరిశుద్ధ హృదయమును జూపుచు, మహాదయగల సర్వేశ్వరునియొక్క ప్రేమా పరమరహస్యముయెడల మానవులు ధ్యానము సలుపుచు, వందనార్పణములను చెల్లించవలెనని మననాథుడగు క్రీస్తు అసమాన్య విధమునను, ప్రత్యేక విధముగను మానవసంతతిని మరల ఆహ్వానించవలయునని కోరియుండెను. ఈ ప్రత్యేక దర్శనముచే తన ప్రేమను, బాగుగా తెలిసికొని దాని నంగీకరించుటలో మానవులు ఆకర్షింపబడుటకు సంజ్ఞారూపకముగా క్రీస్తునాథుడు తన హృదయమును ప్రదర్శించియున్నాడు. అంతేగాక దానితోపాటు, నేటి మన తిరుసభకు అవసరమగు ఆయనయొక్క దయకును, కృపావరములకును చిహ్నముగాను, వాగ్దత్తముగాను దానిని ఆయన నెలకొల్పియున్నాడు.

అదియునుగాక జగత్ పవిత్ర పీఠాధిపత్యము, అర్చ్య. మర్గరీత మరియమ్మగారు వ్రాసిన విషయములను ఆమోదించుటకు మున్ముందె యీ మహోన్నతమైన ఈ తిరుహృదయ భక్తిసాంగ్యములను ఆమోదించెనను ఈ యథార్థ విషయమువలన ఈ భక్తిసాధన క్రీస్తుబోధనా సూత్రమునుండె వెలువడినదని తేటగా తెలియుచు

న్నది. ఎందుకనగా దానిని అట్లు ఆమోదించుట ఉన్నత పరమండల మునుండి పొందిన రహస్య అవిష్కరణవలన జరిగియుండలేదు గాని విశ్వాసుల అభ్యర్థనలవలననే యిట్లు జరిగియుండెను. పవిత్రకార్య ముల జగత్ పీఠ సలహా సంఘముచే 1765 వ సం॥ జనవరి 25 తేదీన ప్రతిపాదింపబడి, మాకు పూర్వమునన్న జగత్, గురువర్యు లగు 13 వ క్లెమెంటు పాపుగారిచె అదే సంవత్సరము అంగీకార ముద్రబడసినట్టి ఒక ఆ దేశము పోలెండు దేశ మేత్రాణులకు, జేసునాథుని మిక్కిలి పరిశుద్ధ హృదయభక్తి సాధన, సోదర సమా జములకును ఈ పండుగ కొనియాడబడుటకు ప్రత్యేకాధికారము నొసంగెను. మానవ పాపములకు ప్రాయశ్చిత్తార్థ బలిగా తనకు తాన బలియగుటకు ప్రేరేపించిన "ఆ దివ్యప్రేమను" జ్ఞప్తికి దెచ్చి కొనుటకు గాను, ఇంతకు ముందె ఆచరణలో నుండిన ఈ భక్తికృ త్యము నలుదిక్కుల వ్యాపించుట చూచి, బాగుగా వ్యాపించవల యునని కోరుటచేతనె అపోస్తులిక జగత్ పవిత్రపీఠము ఇట్టి అంగీ కారము నొసంగెను.

ప్రథమాంగీకారము, ప్రత్యేక అనుగ్రహముగా నొసంగబడి నదియు, పరిమితము చేయుబడినదియునై యున్నది. గాని దానివెనుక ఒక శతాబ్దానంతరము దయచేయుబడిన రెండవ అంగీకారము అధిక ప్రా ముఖ్యముగలిగి గంభీర వాక్యములతో ప్రకటితమైనది. ఇది పైన పే ర్కొనబడిన పవిత్ర జగత్ పీఠ సలహా సంఘముచే 1856 సంవత్సరము ఆగష్టు 23 వ తేదీన ప్రతి పాదింపబడిన డిక్రీని, ఫ్రాన్సు దేశ పవిత్ర పీఠాధిపతులెగాక, కతోలిక లోకములోని దాదాపు మేత్రాణులెల్ల రును పంపిన విజ్ఞప్తులకు చెవిమొగ్గి, చిరస్మరణీయులు మాకు ముం దున్న 9 వ భక్తినాథ పాపుగారు ఆమోవిదించి తిరుసభయంతట తిరుహృదయ భక్తి అభ్యాసములను తగినవిధముగా కొనియాడుట కును వ్యాపింప జేయుటకును ఆమోదించిరి. (35) అది క్రీస్తువు లెల్ల రికి చిరస్మరణీయమైనది. "పొర్లి పారునట్టి నదిప్రవాహము అడ్డము న్నవానిని త్రోసుకొనిపోవు చందమున జేసునాథుని తిరుహృదయ భక్తికృత్యములు ప్రపంచమంతటను వ్యాపించినవి" యని ఆ పం డుగనాటి ప్రార్థన నాపదములలో వ్రాయబడియున్నది.

ఈ భక్తి కృత్యముయొక్క సహజ స్వభావపు లోతులోనికి జొచ్చి, భక్తియుతముగా దానినిగూర్చి ధ్యానించుచు, దానిని వర్ధిల్లజేయుటకు బలమును పొందవలెననియు, మతోత్సాహమునందు పట్టుదల పెంపొందించుకొనవలయుననియు విశ్వాసులు కోరినపక్షమున, పవిత్ర గ్రంథములనుండియు, యుగయుగానుగత పారంపర్య గ్రంథములనుండియు, పవిత్ర సాంగ్యచట్ట గ్రంథములనుండియు, తిరుహృదయ భక్తినిగూర్చి తెలిసికొనవలసియున్నదని మేమింతవరకు చెప్పినదానినిబట్టి తెలియుచున్నది. ఎందుకనగా దివ్యస్నేహాగ్ని రగిలించబడిన మనస్సుతో మోక్షమువంక జూచుచు, పట్టుదలతో ఈ భక్తిని కార్యరూపమున ఆచరించిన ఎడల, క్రీస్తువ జీవితమునకు పట్టుకొమ్మయు, కేంద్రమునైన క్రీస్తునాథుని స్నేహమునొద్దకు తప్పక పోనేరకపోదు. ఆ దివ్య స్నేహమును స్వయముగా రుచిచూచి అనుభవపూర్వకముగా అపోస్తులుడైన అర్చ్య. చిన్నప్పగారు "ఈ హేతువుచేత నాథుడైన జేసుక్రీస్తు పితయెదుట మోకాళ్ళూని.... ....మీారు అంతరంగ పురుషుడగుటకు శక్తి కలిగి ఆయన స్పిరితు వలన బలపరుపబడినట్టును, క్రీస్తుడు మీా హృదయములలో విశ్వాస మూలముగా నివసించునట్టును, మీారు దేవప్రేమలో వేరుపారి స్థిరపడి, సమస్త పరిశుద్ధులతో దాని వెడల్పు పొడుగు ఎత్తు లోతును ఎంతో గ్రహించుకొనుటకును, సర్వేశ్వరుని సంపూర్ణతయందు సంపూర్ణులగునట్లు సమస్త జ్ఞానమునకు మించిన క్రీస్తునిప్రేమను తెలిసికొనుటకును, శక్తిగలవారు అగునట్లును ఆయన తన మహిమైశ్వర్యము చొప్పున మీాకు దయచేయవలెనని ప్రార్థించుచున్నాను." (ఎఫేసి 3:14,16–19) అని మనకు బోధించుచున్నాడు. అంతియేకాక జేసునాథుని తిరుహృదయము, మానవజాతిని కౌగలించనేతెంచు సర్వేశ్వరుని (స్నేహ) సంపూర్ణతకు, తేటయైన ప్రతిబింభముగా నున్నది. దీనినే "దయా సంపూర్ణత" యని మేము నిర్వచించుచున్నాము. ఏలయన దీనినె నూతనవేదములో చక్కగా వర్ణించబడినట్లు "మన రక్షకుండైన సర్వేశ్వరునియొక్క దయయు మనుష్యులయెడల ఆయనకుండు కనికరమును ప్రత్యక్షమాయెను" (తీతు. 3,4) ఎందుకనగా "తన సుతునిచేత భూలోకము రక్షింపబ

దుటకై సర్వేశ్వరుడు ఆయనను భూలోకమునకు పంపెనుగాని భూలోకమునకు తీర్పు విధించుటకు కాదు." (జ్వా: 3:17)

ప్రతికూల వాదములు.

జేసు తిరుహృదయ భక్తినిగూర్చి బోధించు తిరుసభ న్యాయసమ్మతమైన అధికారపత్రములను ప్రకటించిన తదాది దానిని ప్రారంభించుటకు తగిన కారణములు కలవనియె తిరుసభ సర్వదా దృఢవిశ్వాసము గల్గియున్నది. అవి ఏవనగా మానవులయెడల దేవునికిగల అత్యంత స్నేహము వేనిచే పూజింపబడుచున్నదో అట్టిప్రేమ, తృప్తి, యను క్రియలె దానికి కారణములు. ఇవి భౌతికవాదము అని పిలువబడునట్టి లౌకిక వాదమునుండి కూర్చబడినవి కావు .మరియు మూఢ విశ్వాసమను రోగముచే కళంకితమైనదియుగాదు. ఈ భక్తి సాధన ఆత్మయొక్క మతమైన ఒక భక్తి రూపకమైయున్నది. మత సంభంధమైన భక్తిరూపకమునుగూర్చి సమరేయస్త్రీతో సంభాషించు సందర్భమున ప్రవచించెను. ఆ దీర్ఘదర్శనమేమనగా "అయినను, నిజమైన ఆరాధకులు జ్ఞానమున సత్యమున పితను నారాధించెడు కాలము వచ్చును. అది యిప్పుడే వచ్చియున్నది. ఏలనగా తనను నారాధింప పిత అట్టి వారలనే కోరుచున్నాడు. సర్వేశ్వరుడు నిరాకారుడు. ఆయనను నారాధించెడువారు జ్ఞానమునను, సత్యమునను, ఆరాధింపవలెను." (జ్వా: 4:23-24,)

కాబట్టి జేసునాధుని భౌతిక హృదయమును ధ్యానించుట, మనము సర్వేశ్వరుని సన్నిహిత స్నేహమును సమీపించునపుడు అడ్డు తగులుననియు, మహోన్నత సద్గుణములను (పుణ్యములను) అలవరపరచుకొనుటకు అది ఆటంకముగా నున్నదని నిందవేయుట చాలా అసహ్యకర కార్యమైయున్నది. ఈ తప్పుడు సిద్ధాంతము తల ఎత్తినతోడనే తిరుసభ దానిని నిశితముగా ఖండించి త్రోసివేసియున్నది. ఈ ఖండనవాక్యములను మా పూర్వీకులైన పరిశుద్ధ 11 వ ఇన్నోసెన్సు పాపుగారి నోటిద్వారా తిరుసభ ప్రకటించియున్నది. ఈ క్రింద పొందుపరచబడిన ప్రతికూలవాదుల మాటలు ఖండించి త్రోసివేయబడినవి. "(ఈ అంతరంగిక మార్గమున నడచుచున్న ఆ యాత్మలు) అప్పుడు ఇక పరిశుద్ధ కన్యమర్యాంబకుగాని

అర్చ్యశిష్టులకుగాని, క్రీస్తుమానత్వమునకుగాని స్నేహ ప్రకటనము లగు పనులనుగాని, పలుకులనుగాని చేయతగదు. ఎందుకనగా, ఈ కార్యములన్నియు యింద్రియ సంబంధమైనవిగాన వాటిమీద ప్రేమ యుఃగూడ యింద్రియవేద్యము అగుచున్నది. ఏ వ్యక్తియైనను సరే, పరిశుద్ధ మర్యాంబగాని లేక తదితర అర్చ్యశిష్టులుగాని మన హృదయమును ఆక్రమించరాదు. ఎందుకనగా సర్వేశ్వరుండు ఒకరుండు మాత్రమే దానిని ఆక్రమించి; కలిగియుండ కోరుచున్నాడు" (36) ఇట్లు తలంచువారు క్రీస్తునాధుని హృదయము, యింద్రియ వేద్యమైన ప్రేమకంటె, ఉన్నతతరమయిన మరి యే ప్రేమనైనను సూచించదు, కాబట్టి స్వభావ సిద్ధముగా దైవసంబంధమైన దివ్యమగునట్టివాటికి చెందు ఉత్తమారాధనకు ప్రాతిపదికగా నుండజాలదని భావించుచున్నారు. గాని యిట్టి అపార్ధముతో పరిశుద్ధస్వరూపముల అర్ధమునుగూర్చి వ్యాఖ్యానించుట బొత్తిగా శుద్ధతప్పని నమ్మని వాడొకడు నుండడు. అనగా అది కేవలము అపార్ధమని అందరెఱుంగగలరు. ఎందుకనగా ఇందుమూలముగా విశాలతరమైన అన్వయము చాల యిరుకైన హద్దుల మధ్య పరిమితము చేయబడుచున్నది. ప్రతికూలవాద మిట్లుండ యిక కతోలిక మతవేదాంతశాస్త్రజ్ఞుల బోధనయును, భావములును పూర్తిగా వ్యతిరేకముగా నున్నవి. ఎందుకనగా అర్చ్య. తోమాసుగారు చెప్పినట్లు, "అవి వానికొరకైయును భావముతో స్వరూపములు మత సంబంధమైన భక్తికార్యములకు నెలకొల్పబడలేదు. స్వరూపములు స్వరూపమాత్రమే అయియున్నను, అవి ప్రతివ్యక్తిని అవతార దైవముయొద్దకు నడిపించునను భావముతోనె అట్లు నెలకొల్పబడియున్నవి. ప్రతిమ ప్రతిమగాక తదితరమేమగును? కాబట్టి స్వరూపము చెంతకు పోవుట అంతటితోనే అంతరించి పూర్తిగా ఆగిపోవుటలేదు. అయితే ఆ ప్రతిమ ఏ వస్తువుకు లేక ఏ వ్యక్తికి ప్రతిరూపమో దానికె చెల్లును. అందుచేత మనము క్రీస్తునాధుని స్వరూపమును గౌరవించిన మాత్రాన మతాచారమగు ఉత్తమ ఆరాధనకుగాని, మత సారాంశమునకుగాని భంగమువాటిల్లదు. (37) ఆయన స్వరూపములకు చేయు, దూపదీపనై వేద్యమంతయు, మన ప్రేమ లక్ష్యించు అవతారుడగు

దివ్యవార్తకు మాత్రము చెందుచున్నది. (ఇదే దృష్టితో మరియొక సమస్యయు యిదే విధముగా పరిగణింప బడవలసి యున్నది.) అవి (మన ఆరాధన) మన నిమిత్తమై మన దివ్యరక్షకుడు పొందిన కఠోర వేధనలకు సంబంధించినను లేక శక్తిలోను అర్ధ గంభీరతలోను అన్నిటిని మించిన ఆయన ప్రాతినిధ్యమును, అనగా స్లీవకు కొట్టబడిన జేసువుయొక్క గాయపడిన హృదయమునకు సంబందించినను, అవి ఆయనకె చెల్లుచున్నవి.

కాబట్టి క్రీస్తునాధుని హృదయములో నున్న శారీరక, స్వాభావిక అర్థమునుండి క్రీస్తు విశ్వాసము గలిగియున్న మనము ఇంద్రియ గోచరమగు ఆయన ప్రేమను ధ్యానించుటయేగాక మన హృదయములో పోయబడినని ప్రేమను లోతుగా ధ్యానించుటలోను వందించుటలోను ఉన్నత స్థాయికి చేరగలము. అంతియేగాక అవతారుడైన వారియొక్క దివ్యప్రేమను, అత్యంతానురాగముతోను, ఆత్మప్రేరణముతోను ధ్యానించి ఆరాధించగలము. ఎందుకనగా వ్యక్తియైనక్రీస్తులో, మనుష్య దేవస్వభావములు రెండును సమైక్యమైయున్నవని విశ్వాసముద్వారా మనము నమ్ముచున్నాము. మరియు యింద్రియ వేద్యమగు జేసు తిరుహృదయ భౌతిక ప్రేమకును, వాస్తవికముగా అధ్యాత్మికమగు ఆయన మానవమును, దివ్యమునగు ఆయన ద్వివిధ ప్రేమకును మధ్య ఉన్నటువంటి పరమరహస్యమగు సన్నిహితత్వమును గూడా మనము గ్రహించగలము. ఈ రెండు విధములగు ప్రేమలు మన దివ్యరక్షకుని ఆరాధనీయమగు వ్యక్తిలో కలసియుండుటయేగాక మానవమును యింద్రియ వేద్యంబులైన ప్రేమలు దివ్యప్రేమకు విధేయించి వానికి సంబంధించిన సత్వలమును ఉత్పత్తి చేయునుగాన స్వభావిక సంబంధముద్వారా అవి పరస్పరముగా సంధించబడియున్నవని చెప్పవలసియున్నది. ఎందుచేతననగా జేసునాధుని హృదయములో, వారనునట్లు, పలాని రూప ప్రతిభింబము ఉన్నదనిగాని, దానినె మనము ఆరాధించుచున్నామని గాని మనము వితండవాదము గావించుటలేదు. అసలు దానిని అట్లు తలంచుట తప్పు. ఎందుకనగా సృజింపబడిన ఏప్రతిమయు ఆ హృదయ సన్నిహిత సారాంశముతో సమానమని చెప్పబడుటకు

విలులేదు. అయితే అది ఆయన దివ్య ప్రేమయొక్క సమస్తసం పూర్ణ, ఏకైక చిహ్నమని మనవాదన. అయితే ఎన్నియో ఘోర పాపములచేత కళంకమైన మానవజాతిని ప్రేమించుటకు, ఎయ్యది అవతారుడైన దివ్యవార్తతో నేగెనో అట్టి దివ్య స్నేహముయొక్క సంజ్ఞను, ఛాయనుమాత్రమె, జేసునాధుని తిరుహృదయమును వం దించు క్రీస్తువుకు, తిరుసభతో కలిసి ఆరాధించుచున్నాడు.

ఈ అధ్యాయము మన వివేకమునంతటిని ప్రయోగింప దగి నంతటి ప్రాముఖ్యతను గలిగియున్నది. కాబట్టి దేనిచే జేసునాధుని భౌతికహృదయము దివ్య వార్తతో పొత్తు పొందుగలిగియున్నదో అట్టి స్వభావిక చిహ్నముయొక్క సత్యము దివ్య స్వభావ సమైక్యత యను ప్రాథమిక సత్యముపై సంపూర్ణముగా నాధారపడియున్నదని తన మనస్సులో ప్రతివాడు సర్వదా నుంచుకొనవలసియున్నది. ఇది సత్యమైన వాదమని అంగీకరించ ఎవడైనను నిరాకరించినయెడల, యింతకు మునుపు తిరుసభ నిశితముగా ఖండించిన తప్పుడు సిద్ధాం తమును మరల వాదమునకు తెచ్చినవాడగుచున్నాడు. ఎందుకనగా యీ విధముగా జేయుటలో నతడు క్రీస్తునాధుని వ్యక్తిలోగల సమైక్యతనె నిరాకరించుచు ఎదిరించు చున్నాడు. క్రీస్తునాధునిలో రెండు స్వభావములున్నవి. అవి ప్రత్యేక ప్రత్యేకముగాను, సంపూ ర్ణాతి సంపూర్ణముగా నున్నవను సత్యమును మరువరాదు.

## క్రీస్తుమత ఉత్తమ సత్యము.

ఒకసారి యీ ముఖ్యసత్యము మన మనస్సునకు వచ్చిన తదాది జేసునాధుని హృదయము ఎట్లు దివ్యవ్యక్తియొక్క అనగా అవతారుడైన వార్తయొక్క హృదయమె అగుచున్నదో మన మనసు సులభముగా చూడగలదు. అంతేగాక ఆయన ఇదివరకు ఎట్టిప్రేమతో ప్రేమించియున్నాడో, ఈ నాటికిని అట్లే, ఆ ప్రేమా సర్వస్వము మన కన్నులకు సాక్షాత్కరించును. ఈ ప్రత్యేక కారణ ముచే, దివ్య హృదయభక్తి, శ్రేష్టమైన క్రీస్తుమత సత్యముగా మనచే గణించ బడవలయును. ఎందుకనగా క్రీస్తుబోధించిన మతము యిదె. "నేనే మార్గమును, సత్యమును జీవమును, నా ద్వారాకాని, ఎవడును పితయొద్దకు రాడు." (జ్వా. 14,6) అను మాటలలో తేటగా దెల్పి

యున్నాడు. ఇది ఇట్లుండుటచేత, జేసునాథుని పరిశుద్ధ హృదయ భక్తిసాధన దాని స్వయం స్వభావమును బట్టి చూడగా, క్రీస్తు మూలముగా దేనితో మనలను సర్వేశ్వరుడు ప్రేమించెనో, అట్టి ప్రేమ రూపొందిన భక్తి కృత్యమనియు, అంతేకాక ఏకకాలమున దేనిచే మనము సర్వేశ్వరుని వంకకు, మానవుల వైపుకు ఆకర్షింప బడుదుమో ఆ ప్రేమయొక్క సాధనమైయున్నదనియు సులభముగా మనము తుది నిర్ణయము చేయవచ్చును. అనగా ఆ భక్తితో సర్వేశ్వరునికి మనయెడలగల ప్రేమకు మనలను మనమే పురికొల్పుకొనుచున్నాము. ఆ ప్రేమ దీనిలోనే ఆరాధింపబడి కృతజ్ఞతాస్తుతులు పొందుచున్నది. ఆ ప్రేమను అనుకరించుటకొరకే మనము లోకమున జీవించుచున్నాము. దేవునితోను సోదర మానవులతోను మనము దేనిచే బంధింపబడియున్నామో ఆ ప్రేమా సంపూర్ణత్వమును సమకూర్చి సిద్ధింపజేయుటే ఈ భక్తి లక్ష్యించు ప్రధానోద్దేశమైయున్నది. దీని ఫలితముగా మన దివ్యరక్షకుడు అపోస్తులకు స్థిరాస్థిగా ప్రసాదించిన "నూతన ఆజ్ఞ"ను అత్యంత ఆతురతతో మనము నిర్వహించ గలుగుచున్నాము. ఆ నూతన ఆజ్ఞను జేసుస్వామి ఈ క్రింది మాటలలో నిర్వచించియున్నారు. "మీరు ఒకరినొకరు ప్రేమింపవలెనని మీకు నూతన ఆజ్ఞ నిచ్చుచున్నాను నేను మిమ్ము ను ప్రేమించినట్టు మీరు ఒకరి ఎడల నొకరు ప్రేమగలిగి యున్నపక్షమున......నేను మిమ్మును ప్రేమించినట్లు మీరును ఒకరినొకరు ప్రేమించుటయే నా ఆజ్ఞ" (జ్వా. 13:34–15:12). అవును, యిది క్రొత్త ఆజ్ఞయగుటయేగాక క్రీస్తుస్వామి సొంత ఆజ్ఞ అయియున్నది. ఎందుకనగా దానినిగూర్చి అర్చ్య. తోమాసుగారు "ప్రాత క్రొత్త నిబంధనల మధ్య ఎక్కువ వ్యత్యాసములేదు. ఎందుకనగా నేను యిశ్రయేలీయులతో ఒక క్రొత్త నిబంధన చేయుదును" అని (జెరేమి 31:31) జెరేమియా దీర్ఘదర్శి చెప్పియున్నాడు. ఈ యాజ్ఞ పవిత్రభీతి, ప్రేమ యనుపదములో నణగి, క్రొత్త నిబంధనను బట్టియే పాతనిబంధనలో ముందుగానే తెలుపబడియున్నది. గాన ఈ యాజ్ఞ పాత వేదములో తగునంత విదితముగా లేని కారణముచేతను, అదియు నూతన వేదమునకు ఆయిత్త రూపమైనందునను జేసునాథుడు దీనిని సరి క్రొత్తగా ఆజ్ఞాపించియున్నాడు" (38

## 5 వ అధ్యాయము.

### ముగింపు ప్రకరణము

ఎల్లరికి మేలుకొలుపు:

ఈ భక్తిరూపము యొక్క సుందరమైనట్టియు, ఆకర్షణీయమైనదియు, అలంకరణాయుతమైనగు సత్యస్వభావమును గూర్చియు, ఆ [illegible] ప్రకారమునకు ఏసుక్రీస్తుభక్తి కృత్యమును గూర్చియు, మా ధ్యానపత్రికయందు మేమింతవరకును తెలిపిన భావముల ద్వారా మీకు [illegible] తెలిపియున్నాము. అర్చ్య. రాయప్ప మన ఏలినవారగు జేసుక్రీస్తుని యెడల తనకు గల ప్రేమను ముమ్మారు బహిరంగముగా నొప్పుకొనెను. ఆయనను అంగీకరించినమీదట దేనిని పొందెనో అట్టి పవిత్ర పీఠాధిపత్యమును వహించిన మేము, మిమ్మును మీ ద్వారా క్రీస్తునాథునియందు మా బిడ్డలైన వారినెల్లరను మహా మధురముగల ఈ భక్తికృత్యములను అలసట నెరుంగని ఉత్సాహము తో కొనియాడవలెనని మేము ప్రోత్సహించుచున్నాము. అవును అది తగిన కార్యమనియె మా దృఢనమ్మకము. ఎందుకనగా నేటి, మన యుగమందుకూడా దానినుండి అనేక లాభములను మనము పొందగలమని మేము నిరీక్షించుచున్నారము.

స్లీవకు అంటగొట్టబడిన ఆయన హృదయభక్తి యొక్క ముఖ్యోద్దేశములను లోతుగా నాలోచించినచో, యిది ప్రతివాని తన యిష్టమగుచో నాదరించి, లేక అయిష్టమగుచో ఆవలకు త్రోసి వేసి చిన్నపుచ్చునట్టి ఒక సామాన్యమైన భక్తిసాధనము కాదనియు, అట్టి సమస్త దివ్యహృదయ భక్తిసాధనపట్ల జనించదనియు, బహుశా జనించినను చెల్లసేరదనియు, మీదు మిక్కిలి, అది క్రీస్తుజీవిత సంపూర్ణతను పొందుటకొరకైన మతాచార అభ్యాసమైయున్న దని ప్రత్యేకమునికి సుస్పష్టముగా గలదు. ఏలనగా, దైవశాస్త్ర ప్రకారము, మరియు సామాన్యభావమును బట్టి చూడగా, అమరపండితుడు నిర్వచించినట్లు "భక్తి" యనగా దేవుని సేవకు చెందునట్టి వస్తువులకు ఒకడు తన ఇష్టము చూపుటకుగల సంసిద్ధత అనియర్థము. (39) ఆయన ప్రేమకు సమర్పించుకొను కార్యమునకంటె ఏది అవ

సరతరమై, శ్రేష్ఠతరమై, మధురతరమై యుండగలదు? దివ్య స్నేహ
ముతో నేకీభవించి, ప్రేమచే ప్రేరేపింపబడి సమర్పింపబడు సేవ
కంటె, దేవునికి ఎక్కువ ప్రీతికరమగు, అధికా మోదకరమునైనది యిక
ఏదైనా ఉండగలదా? సొంత ఇష్టముతో సమర్పితమగు ఎట్టి సేవ
యైనను ఏదో విధముగా నొక యారాధనయే అగుచున్నదిగాన ఉదార
పూరితములగు బహుమానములన్నియు దేనిచే (ప్రేరేపితమై) యివ్వబడుచు
న్నవో అట్టి ప్రేమ మొట్టమొదటి ప్రేమయొక్క గుణమును గలిగి
యున్నది. (40) కాబట్టి అట్టి మత భక్తి కృత్యము, మహా గౌరవ
మైనదిగా పరిగణించబడవలెను. ఎందుకనగా ఈ భక్తికృత్య అభ్యాస
ముద్వారా, మానవుడు సర్వేశ్వరుని పూజించి, స్నేహించుటయే
గాక తనకుతాను దివ్యస్నేహమునకు విధేయునిగా జేసికొనును. దీని
నంతయు క్రీస్తువ ప్రజానీకమునకు ప్రతిపాదించ నెంచియే మన రక్ష
కుడు దీనిని రూపొందించియున్నాడు. మరియు దానిని పవిత్ర జగత్
పీఠాధిపతులు, చిరస్మరణీయములగు అధికారపత్రములద్వారా పరి
రక్షించి సుసంపన్నము గావించియున్నారు. కాబట్టి జేసునాథుడు
తిరుసభకు ప్రసాదించియున్న యిట్టి వరమును ఎవడైనను చిన్న
పుచ్చుకోరిన యెడల, తొందరపాటుతో కూడినట్టియు హానికరమగు
నట్టియు, విద్రోహకరమగునట్టియు, పనినిచేయ బూనుచున్నాడని
తెలిసికొన వలయును.

కాబట్టి మన దివ్యరక్షకుని మిక్కిలి పరిశుద్ధ హృదయమునకు
క్రీస్తువులు ఇట్టి భక్తియుత అర్ఘ్యమును (పూజకు తగినది) సమర్పిం
చుటద్వారా, తమ బాధ్యతను, విధ్యుక్తధర్మమును నిర్వహించుచు
సర్వేశ్వరుని సేవించుటయే గాక, తదేక కాలమున తమను, తమ
కు గల సర్వస్వమును తమ తలంపులను, క్రియలను దైవాధీనము
గావించి, తద్వారా "నీవు నీ పూర్ణహృదయముతో, నీ పూర్ణ ఆత్మ
తోను, నీ పూర్ణమనస్సుతోను, నీ పూర్ణశక్తితోను, నీ సర్వేశ్వరు
డైన యేలినవారిని ప్రేమించుదువుగాక" (మార్కు 12-30) అను
దైవాజ్ఞకు విధేయించు చున్నారనుట కెట్టి సందేహమును లేదు.
అదియునుగాక వారల వర్తమాన జీవితములోనో లేక నిత్యజీవిత
ములోనో, తన శరీరమునకో, దేవుడు చేసిన యేదొక ప్రత్యేకోప

కారము నిమిత్తముగాక, ఎవనిని సేవించ వారలు యత్నించుచున్నా రో ఆ దేవుని మంచితనముచేత ప్రేరేపింపబడిన వారలై, ప్రేమ ను ప్రేమకు బదులుగా సమర్పించుచు, ఆయనను ఆరాధించి [illegible], ఆయనకు ఋణపడియున్న ఉచిత కృతజ్ఞతా స్తుతులను [illegible] చెల్లిం చుచున్నారు. అది యట్లుగాని-యో జేసు క్రీస్తునాథుని [illegible] శుద్ధ హృదయ భక్తిసాధన క్రీస్తుమత సత్యస్వభావమునకు [illegible] చి యుండజేరదు. ఎందుకనగా ఆ విధముగు భక్తిసాధన [illegible] వస్తువులకంటె అధికతరమగు ప్రేమతో మానవుడు [illegible] హించలేడు. అందుచేత మహాత్తరమగు యీ భక్తి [illegible] అపార్థము చేసికొని, తప్పిదముగా ఆచరించువారు, [illegible] ప్రేమించువారలనియు, [illegible] అభిమానించు [illegible] యు న్యాయవిరుద్ధముగా గాకుండా దోషారోపణ చేయబడ [illegible].

కాబట్టి జేసునాథుని మహా పరిశుద్ధ హృదయ భక్తి [illegible] దానియొక్క బాహ్యకార్యములే ప్రధానములుగావని [illegible] బాగుగా నెరుంగవలయును. మరియు, కతోలిక [illegible] అనగా ప్రేమ, [illegible] కార్యనిధులను భక్తి [illegible] నెరవేర్చుటకు మానవులు కదిలించబడుటకును, [illegible] మించగలుటకును లేక అధికతరమైన శక్తిని సమకూర్చుకొనుటకు గాని, క్రీస్తునాథుడు, కొందరి భక్తులకు ప్రత్యేకముగా నొసంగిన వాగ్దత్తము ఈ భక్తికి ముఖ్యకారణము కాజాలదని ప్రత్యేకముగా నిర్దుష్టముగా నెరుగవలెను.

### సంశయపడువారలకు ప్రోత్సాహము.

కాబట్టి క్రీస్తునందు మా బిడ్డలారా! వారు, రక్షకుని హృద యమునుండి ఉబికిపారు రక్షణజలముల నిదివరకే [illegible] వారలు కానిండు, లేక సంశయ మానసములతో దూరమునుండి వింతగా వీని వంక చూచువారు కానిండు, ఈ భక్తికృత్యమును అత్యంత హృదయ పూర్వకముగా కొగలించ మేము ప్రబోధించు చున్నాము. మేమింతకుముందు చెప్పిన విధమున తిరుసభలో పూర్వమునుండి యున్న భక్తిరూపకమును గూర్చియే మనము ముచ్చటించుచున్నామని వారందరు జాగ్రత్తతో లోతుగా భావిం

చవలసినయున్నది. ఈ భక్తిసాధన సువిశేషములపై గట్టి పునాది గల్గి మాకు పూర్వమున్న రోమను పీఠాధిపతులచే స్వయముగా బోధించబడి సాంఘిక చట్టముంద్వారా బాహాటముగా సిఫారసు చేయబడి, అసంఖ్యాకములగు పొగడ్తలతో నుగ్గడింపబడినట్టిదై యున్నది. వారందరు మన రక్షకుని మహత్తర హృదయ గౌరవార్థముగ నొక పండుగను సంస్థాపించి దానిని విశ్వజనీనమైన తిరుసభ యందంతటను పరివ్యాప్తి చేయుటతో నిజముగా సంతృప్తి నొందక, ఆ మహా పరిశుద్ధ హృదయమునకు మానవ సంతతినంతను గంభీరముగ ప్రతిష్ఠితము జేసి సమర్పించు కార్యమునకు బాధ్యులై గూడ యున్నారు. (41) దీనికంతటికి చివరన తిరుసభ దీనినుండి పొందిన పుష్కలములను, మహా ఆదరణ కరములగు సత్ఫలములను చేర్చవలసి యున్నది. ఆ సత్ఫలము లేవనగా:-ప్రజలు చాలామంది మనస్సు మార్చుకొని తిరుసభలో చేరిరి. అనేకమంది క్రీస్తువుల విశ్వాసమనెడి పిండి బాగుగా పులియబెట్టబడుట; మానవులను అమితముగా ప్రేమించు మనరక్షకునితో విశ్వాసులు సన్నిహిత సంబంధము నొందుట; ఇవన్నియు గత అంతిమ శతాబ్దములలో తరచుగా తెలియబడునట్లు, ప్రదర్శితములై మా గమనికకు తీసికొని రాబడినవి.

### తిరుసభ పరిపాలకులకు ప్రోత్సాహము.

జేసుహృదయ భక్తిని క్రీస్తువ లోకమంతయు విరివిగా వ్యాపించి, భక్తిమూలముగా నాచరించబడుట గాంచునపుడు ఆనంద ఆదరణల నొందుచు మున్ముందుగా సర్వశుభ నిధియగు మన రక్షకునికి, కృతజ్ఞతాస్తుతులను చెల్లించిన తదుపరి ఈ భక్తిసాధన అభివృద్ధియగుటకు తమ సహాయములను వ్యయపరచిన గురువులను, క్రీస్తువులను పితృహృదయముతో మేము అభినందించక ఉండలేము.

వందనయోగ్యులగు సోదరులారా!

జేసునాధుని హృదయ భక్తిసాధన, ప్రతి స్థలములో క్రీస్తువ జీవిత సత్ఫలములను కాసినప్పటికి, లోకమందున్న యుద్ధసభయు, ముఖ్యముగా పౌరసంఘములును, పరమ రహస్యమగు తిరుసభాపతికి. పతియును, మానవజాతి రక్షకుడునగు జేసునాధుని పథకములను కోరికలను అనుసరించుటయందు ఉన్నత స్థాయికి నింకను జేర

లేదు. ఎందుకనగా తిరుసభ బిడ్డలగు వారెందరో తమలో తాము
పొందిన పాపపు ముడతలచేతను మచ్చలచేతను నిరూపమగుటయే
గాక తమ తల్లియొక్క సుందర ముఖమునుగూడా విరూపముగా
మార్చుచున్నారు. పరిశుద్ధత్వమును పొంద పిలుపునొందిన క్రీస్తువు
లలో చాలమంది పవిత్రజీవితముద్వారా ఆ పావనత్వమును ప్రసార
ము జేయుటలేదు. తనతండ్రి యింటినుండి అక్రమముగా వెడలి
తప్పిపోయిన పాపులెల్లరును, అచట మొదటి అంగీని ధరించి,
కుమారుని చిహ్నమైన ముద్దుటుంగరము వ్రేలికి పెట్టుకొని తమ
అర్ధాంగికి విశ్వాస్యతను వాగ్దానము జేయుటకు స్వగృహమున కిం
కను తిరిగిరాలేదు. (లూ. 25; 22) అన్యమతస్థులెల్లరు క్రీస్తుని జ్ఞాన
శరీరమైన తిరుసభలోనికి ప్రవేశపెట్టబడలేదు; ఇంతియేగాదు!
విశ్వాసులందు మంచివాలలో సయితము విశ్వాసము సన్నగిల్లుటను
గాంచ మాకు చాలా బాధకరముగా నున్నది. వారు లౌకిక సంప
దపైగల దురాశచే మోసపోయి తమయందున్న దేవప్రేమాగ్ని
జ్వాలలను క్రమేణ ఆర్పుకొని తుదకు పూర్తిగా సమసిపోవుటకు
వారలు అవకాశ మొసంగుచున్నారు. ఇంతకంటెను ఎక్కువగా
నిరీశ్వరవాదుల ప్రయత్నములను గాంచుట మా హృదయము
విదారితమగుచున్నది. నరకఘోర పిశాచిచే ప్రేరేపింపబడినారో
యనంగ యిప్పుడు మరీ ఉధృతముగా చెలరేగి సర్వేశ్వరుని యెడ
లను ఆయన తిరుసభ యెడలను, అందరికంటె మరిముఖ్యముగా
లోకములో దివ్యరక్షకునియొక్క వ్యక్తిత్వమునకును, ఆయనకు
మానవులు యెడలగల ప్రేమకును ప్రతిగా మానవులు చూపుభక్తి
పట్ల నిరంతరము ద్వేషాగ్ని జ్వాలలను బరపుచున్నారు. " ఎవనిగూ
ర్చి అనుమానము ఉన్నదో అతడు (పీటరు) ప్రశ్నింపబడుచు
న్నాడు. ఏలినవారు ఆయనను ప్రశ్నించినపుడు, తన్నాతడు ప్రే
మించుచున్నాడో లేదోయని తెలిసికొనుటకు ప్రశ్నించలేదు. గాని
తాను మోక్షమున కారోహించుటకు ముందు మన యెడల తన
కుగల ప్రేమకు ఎవనిని తన ప్రతినిధిగా లోకములోనుంచి తాను
పోదలంచెనో అతని కా విషయమును ప్రబోధించుటకై అట్లు ప్ర
శ్నించెను." (42) అని మిలాను పండితుడు రక్షకుని కిమానవు పై

గల ప్రేమనుగూర్చి నుడివెను.

నిజముగా సర్వేశ్వరుని రూపము పోలికతో మానవుడు సృష్టింపబడి యున్నాడు. మోక్షములో దేవుని పరిపూర్ణతను నిత్యకాల సహవాసమునకు మానవుడు వరము నొందియున్నాడు. ఇట్టి భాగ్య దశను పొందిన మానవుడు సర్వేశ్వరుని ఎడల ద్వేషభావమును జూపుటకంటె అధిక ఘోరాతి ఘోరమైన నేరమును మరియొక దానిని మానవుడు ఎప్పుడైనను చేసియుండడు; ఎందుకనగా దైవము పట్ల ద్వేషమును ప్రదర్శించు నరుడు ఉన్నత తమ మైన శ్రేయస్సు నుండి తనంతట తాను తనను పూర్తిగా నరికి పారవేసి కొనుచున్నాడు; దానిచేతనే సర్వేశ్వరునినుండి వచ్చెడి సమస్త ఈవులను అనగా దేవునితో మనలను ఐఖ్యముగా బంధించు దాని నంతయు, దేవునిని అనుభవించుటకు తీసికొనిపోవు మార్గము లన్నిటి నుండి అనగా సత్యము సద్గుణము (పుణ్యము) సమాధానము, న్యాయములను, తననుండియు, తన పొరుగు వారలనుండియు దూరముగా త్రోసి పారవేయుటకు నరుడు నిర్బంధింప బడుచున్నాడు. (43) కాబట్టి నిత్యదేవునియెడల ఎవరు ద్వేషమును జూపించుటలో విజృంభించుచున్నారో వారల యొక్క సంఖ్య పెరిగిపోవుటను; దృఢనమ్మికలోను, కార్యములలోను, భౌతికవాదపు పెూసగింపులు నిలకడగా ఎట్లు కొనసాగుచున్నవో; కామమువట్ల స్వేచ్ఛ సర్వత్రా ఎట్లు విజయించుచున్నదో, అను సంగతులను ఒకడు కాంచునపుడును; క్రీస్తుమత శాసనములలో ఏది మహోన్నతమైనదో, సత్యమును సర్వ సంపూర్ణమునైన నీతికి ఏది బలతమమైన పునాదియో, నిష్కళంకమైన ఆనందమునకు ఏది ఆధారమో అట్టిది అయిన ఆ దివ్యస్నేహాగ్ని, అనేకుల హృదయాలలో చల్లారి ఆరిపోవుటను వాడు ఆశ్చర్యపడ నవసరమున్నదా? ఇట్లు జరుగుటకు మూల కారణమేమి? ఆకారణమును మన దివ్య రక్షకుడు ఎన్నడో దీర్ఘ దర్శనముగా బలికియున్నాడు. "ఇవ్విధమున పలు పాతకములు విస్తరిల్లుటచేత, అనేకుల దేవభక్తి చల్లారును" (మత్తే: 24: 12) గౌరవనీయులగు సోదరులారా! మానవులను, కుటుంబములను, దేశములను, సర్వ ప్రపంచమును నేడును జరిగిన దినములలోను బహుగా

బాధించు యిట్టి ఘోరానర్థములకు తగిన నివారణ ఔషధమును మనము ఎచట పొంద గలము? కతోలిక విశ్వాస మనెడు మూసకు చక్కగా సరిపోవునట్టియు, నేటిమన కాల తిరుసభ అవసరములకును, మానవసంతతి అవసరములకును, ననువగునట్టి భక్తి రూపకము, జేసునాధుని మహత్తర హృదయ భక్తి సాధనకంటె శ్రేష్టమైనది వేరొండుగలదా? దేనిని గూర్చి మేమిచ్చట ప్రస్తావించు చున్నామో ఆ భక్తి సాధనపూర్తిగా సర్వేశ్వరుని స్నేహము దిశకే—ఆ దిక్కుకు మాత్రమే—గురిపెట్ట బడినందుచేత మతాచారములలో యిక యేది దీనికంటె శ్రేష్టతరమై, మధురతరమై, వంద్యతరమై యుండగలదు? (44) కడన క్రీస్తుప్రేమకంటె బలతర మైనది ఏది యుండగలదు? ఆ ప్రేమను నానాటికి పెంపొందించి, వెదజల్లునదియు, సువార్త సత్యములను తమ దిన జీవితములలో నాచరించ, క్రీస్తువులను బురికొల్పునదియు ఈ తిరు హృదయ భక్తి సాధనే! కాబట్టి యిట్టి క్రీస్తుప్రేమ విస్మరింపబడిన యెడల యిక ఎన్నటికిని నిజమైన సమాధానము మన జాలదు. ఏలయనగా పరిశుద్ధాత్మ దివ్య గ్రంథమున హెచ్చరించినట్లు "నీతియె సమాధానమును గలుగ జేయు మూలకారణమై యున్నది." (ఇజయాసు 32: 17)

కాబట్టి, మాకు పూర్వమందున్న జగత్ గురువర్యుల అడుగుజాడలను వెంబడించుచు, క్రీస్తునందు మాకు బిడ్డలైనవారికి గత శతాబ్దాంతమున చిరస్మరణీయులైన పరిశుద్ధ 13 వ లియోపాపుగారు క్రీస్తువులందరికేగాక, మనఃపూర్వకముగా పౌర సంఘుకార్య సభికులందరికిని హెచ్చరికగా నుడివిన వాక్యములను మేము యిపుడు వినిపించ సంతసించుచున్నాము. "ఇదిగో! ఈ దినమొక శుభదినము. దివ్యతమమునైన చిహ్నము మనకు గోచరమగుచున్నది. అది జేసునాధుని మిక్కిలి పరిశుద్ధ హృదయమే! అది మంటలమధ్యకనులు మిఱుమిట్లు గొల్పు గొప్ప కాంతితో జ్వాజల్యముగా భాసించుచున్నది. మన నిరీక్షణలన్నియు దీనియందే లగ్నము చేయబడవలెను. ఎందుకనగా దీనియందే మానవ రక్షణ అన్వేషించబడి, నిరీక్షింపబడవలెను." (45)

అంతియేగాక "క్రీస్తువుడు" అను నామమందు అతిశయించు వారందరును, క్రీస్తురాజ్య వ్యాపకమునకు బహు కష్టించి పనిచేయు వారును; జేసునాథుని హృదయ భక్తిని సాధనగా గొని, దానిని ఐఖ్యత, ఆత్మరక్షణ సమాధానములకు విజయ పతాకముగాను, జన్మభూమిగాను పరిగణించవలయునని మా మనఃపూర్వకమగు కోరికయైయున్నది. క్రీస్తవప్రజలు తిరుసభ నాయకత్వము నపేక్షింపులచే తిరుహృదయభక్తి కృత్యములతో దివ్యరక్షకుని గౌరవించుచున్నారు. ఇందుమూలముగా ఇతర భక్తిరూపకముల కిది అంతరాయము కలిగించునని ఎవడును అనుమానించరాదు. జేసుహృదయ భక్తి అభ్యాసములవలన నిస్సందేహముగాను, నిరుపమానముగాను, మహా పరిశుద్ధ స్లీవయెడల భక్తిని, దివ్యసత్ప్రసాదముయెడల ప్రేమను అభివృద్ధిపరచును. ఆ హృదయముయొక్క మిక్కిలి లోతును, పరమ రహస్యమునగు ఆలోచనలు ఎవనికో ఒకనికి తెలియజేయబడక యుండినచో స్లీవవేయబడిన క్రీస్తునుగురించి తగిన విధముగా ఎన్నటెన్నటికిని అనుభవవేద్యముగా ఎవడును ఎరుగక పోయెడివాడే యని మేము నిజముగా తీర్మానించవచ్చును. అర్చ్య. జత్రృతకును, అర్చ్య. మర్గరీత మరియకును, క్రీస్తు ఇందునుగూర్చి తెలియపరచిన సందేశము ఆశ్చర్యమును గొల్పుచున్నది. జేసునాథుని దివ్యహృదయ భక్తి మన జీవితములో అభ్యసించిననేగాని, ఆయన మనకు తన్నుతాను మన జ్ఞానభోజనముగా నిచ్చుటకు ఇమిడియున్న మహోన్నతమైన ప్రేమను ప్రశంశించుటకు కూడా మనకు సులభముగా నేరదు "మహోన్నతమైన ప్రేమ ప్రకటనాకృత్యముతో మన దివ్యరక్షకుడు దివ్యసత్ప్రసాదమును స్థాపించియున్నాడు. అంతములా లముగా తన హృదయ సర్వసంపదలను మనకు నిచ్చి లోకాంత్యమువరకు ఆయనమనతో నుండుటకే ఇట్లు జేసెను" (46) అని 13 వ లియోపాపుపాపుగారు నుడివినవాక్యము మాకు జ్ఞాపకమునకు వచ్చుచున్నది. "తన హృదయ సంపూర్ణ స్నేహబాహుళ్యము తనను ప్రేరేపించగా జేసు మన కొసంగిన దివ్య సత్ప్రసాదము ఆయన హృదయములో నొక భాగముమాత్రమే కానేరదు." (47)

చివరగా, దేవునికిని తిరుసభకును శత్రువులైనవారు పన్నిన భక్తి రహితములగు తంత్రములపై దాడి సలుపుటకును, మరియు కుటుంబపౌర సమాజములను, సర్వేశ్వరుని పొరుగువారలను స్నేహింప జేయ నడిపించుటకును, జేసునాధుని పరిశుద్ధ హృదయ భక్తిసాధన దివ్యస్నేహమును గరపుటలో ఉత్తమ తర్ఫీదు నిచ్చునని నిరూధపరచ మేము సాహసించుచున్నాము. మేమిట్లు వాక్రానుటకు కారణము లేక పోలేదు. అదియేదనగా ప్రతివానివ్యక్తి ఆత్మలోను, మరియు కుటుంబ జీవితములోను, సకల జాతుల జీవితములోను సంస్థాపించ వలసి యున్న దైవరాజ్యము, దివ్యస్నేహమనెడి పునాదిపైన కట్టబడవలెను.

దీనిని గురించి, భక్తి [illegible] ట్టియు, పాపుగారు ఎంతో వివేకముతో హెచ్చరించియున్నారు. వారి హెచ్చరికలను వినుడు. "జేసుక్రీస్తునాధుని రాజ్యము దాని బలమును, రూపమును దివ్యస్నేహమునుండియే పొందును. పరిశుద్ధమును, క్రమాగతమైన ప్రేమయే దానియొక్క పునాదియును సారసంగ్రహమునై యున్నది. ఇక ఈ భక్తికృత్యమువలన పొందు ఫలము లేవనగా:—ఒకడు తన విధ్యుక్త ధర్మమును మనఃపూర్వకముగా నిర్వహించుట, ఇతరుల హక్కులకు ఎట్టి విధమైన అంతరాయము కల్పింప కుండుట, పరలోక విషయములకు మానవ మగు ప్రతి విషయమును తక్కువది యని భావించుట, సకల వస్తువుల కంటె సర్వేశ్వరుని ప్రేమకే ఆధిక్యత చూపించుట" (48)

## ముగింపు వాక్యములు:

క్రీస్తువకుటుంబముపైన, కాదు, కాదు, మానవ సంతతి అంతటికిని, జేసునాధుని హృదయ భక్తి సాధన నుండి, పుష్కలమైన మేలులు పొరవలయుననిన, ఈ భక్తికి పరిశుద్ధ మరియమ్మగారి నిష్కళంక హృదయ భక్తిసాధనను సమైక్యపరచ క్రీస్తువులు ప్రయత్నించవలసి యున్నది. ఎందుకనగా మానవ రక్షణ కార్యములలో పరిశుద్ధ కన్యమరియాంబ క్రీస్తుతో ఐక్యమైయుండవలయుననియు, అందుకు ఫలితముగా తన దివ్య మాతృప్రేమతోను, శ్రమలతోను సన్నిహితముగ సంబంధ బాంధవ్యము గల్గిన క్రీస్తుయొక్క పాటుల

నుండియు, ప్రేమనుండియు మానవరక్షణ రావలెననియు, సర్వేశ్వరుడు చిత్తగించి యున్నాడు. మరియమ్మద్వారా క్రీస్తునుండి దివ్యజీవమును వారలు పొంది యున్నందువలన, జేసునాధుని హృదయము పట్ల తగిన భక్తిని చూపిన పిమ్మట, క్రీస్తుప్రజలు తమ మోక్షమాతయొక్క ప్రేమగల హృదయమునకు గూడా కృతజ్ఞతాపూరిత హృదయముతోను, పాపపరిహారము జేసుకొను ఆశతోను తమ భక్తి, ప్రేమ ఉత్సాహము ప్రదర్శించుట ఎంతగానో తగియున్నది. నిజముగానే దేవుని మధురమును, మితిలేని జ్ఞానముతో గూడిన ఏర్పాటునకు ఎంతయు తగినట్లే, తిరుసభను, దానితోపాటు లోకమంతటిని గూడా పరిశుద్ధ కన్యమరియాంబ యొక్క పాపమెరుగని పవిత్రహృదయమునకు సమర్పించితిమి. ఆ గంభీర సమర్పణాక్రియ చిరస్మరణీయముగా నున్నది. (49).

పైన మేము వివరించిన ప్రకారము చిరస్మరణీయులైన 9 వ భక్తినాధ పాపుగారు జేసునాధుని తిరుహృదయ పండుగను తిరుసభయంతట కొనియాడ శాసించిన నాటినుండి, ఇప్పటికి ఒకశతాబ్ద సంపూర్తి, ఈ సంవత్సరములోనే రానున్నది. గౌరవపాత్రులగు సోదరులారా! ఈ స్మారక శతవార్షిక మహోత్సవమును, క్రీస్తుజనులచే బహిరంగ ఆరాధన, కృతజ్ఞతా సమర్పణ, పరిహారక్రియారూపముగ ప్రతిచోట వైభవోపేతముగా కొనియాడబడవలెనని మేము హృదయపూర్వకముగా ఎంతో ఆశించు చున్నాము. క్రీస్తువుల ఆనందము, భక్తియొక్క బహిరంగ ప్రదర్శనలు, ప్రత్యేక సముత్సాహముతో జరుపబడగలవు. ప్రేమ సమైఖ్య జపములు నిస్సందేహముగా మీకు అందగా నుండ గలవు- అంతియేకాక యీ భక్తిసాధనకు పాలకార్భ్యశిష్టురాలున్ను, ప్రచారిణియునగు పరిశుద్ధ కన్య, సర్వేశ్వరుని సంకల్పముచే ఏ జాతియందు జన్మించెనో, ఆ జాతిలో గూడా ఉత్సాహము వెల్లివిరియ గలదు.

మేమిచట ప్రతిపాదించిన విషయములు బాగుగా గ్రహింపబడి, అఖ్యానసంస్థాపనములోనికి మార్చబడిన యెడల, తిరుహృదయ భక్తిసాధన [illegible] యొక్క [illegible] ఫలములు తిరుసభ [illegible] [illegible] [illegible] [illegible] [illegible] చేకూర్చుచున్నది.

దేవుడు తన వరప్రసాద బలముతో మా విన్నపములను ఆల కించుదురని మేము ప్రార్థించుచున్నాము. మరియు దైవప్రేరే పణవలన ఈ వార్షిక మహోత్సవము ఫలితముగా, మిక్కిలి పరిశుద్ధ హృదయముపట్ల విశ్వాసము, ప్రేమ నానాటికి వర్ధిల్లి, ఆయన రాజ్యము ఈ లోకమంతా వ్యాపించుగాక. ఇచట (రాజ్య ము) అని వ్యవహరించబడినది ఏదనగా:—"సత్యము—జీవము: పరి శుద్ధరాజ్యము—వరప్రసాదరాజ్యము; నీతి ప్రేమ సమాధానముల రాజ్యము!" (50).

సంస్తుతీ పాత్రులగు సోదరులారా! మీకును, మీ గురువు లకు మీ కప్పగించబడిన క్రీస్తువులకు ముఖ్యముగా జేసునాధుని మిక్కిలి పరిశుద్ధహృదయ భక్తిని, నిండు మనస్సుతో వ్యాపింప జేయు ప్రతివారికి వాగ్దత్తము జేయబడిన యీవుల సూచించుచు, సంపూర్ణ హృదయముతో అపోస్తులిక ఆశీర్వాదమును అందజేయు చున్నాము.

ఈ నిరూపము మా పరిపాలన 18 వ యేట రోము నగర మందున్న అర్చ్య. రాయప్పగారి దేవాలయములో 15-5-1956 వ తేది ఇవ్వబడి ప్రచురించబడినది.

ఇట్లు

✠ 12 వ భక్తినాధ పాపుగారు.





పరిశుద్ధ 12 వ భక్తినాథ పాపుగారు.

జననము. 2—3—1876

గురుపట్టము. 2—4—1899

పాపుగారి పట్టాభిషేకము. 12—3—1939

మరణము. 9—10—1958